# విషయ సూచిక

# మున్నుడి



**శ్రీ దువ్వూరి సూర్యనారాయణ శాస్త్రి & శ్రీమతి సుబ్బలక్ష్మి దంపతులు**

## జననము – బాల్యము :

ఈయన, గోదావరి తీరం ఆత్రేయ, భారద్వజ, గౌతమి నదుల సంగమ స్థానము, తూర్పు గోదావరి – ద్రాక్షారామానికి సుమారు 7 కి॥మీ దూరములో ఉన్న "మసకపల్లి" (మస్కరపల్లి) గ్రామంలో జన్మించినారు. దువ్వూరి పెదశేషయ్య, శేషమాంబ వీరి జననీ జనకులు.

## విద్యాభ్యాసము :

ప్రాథమిక విద్య స్వగ్రామములోను, మిగిలిన విద్యాభ్యాసము ద్రాక్షారామము, కొవ్వూరు, విజయనగరము మహారాజా కళాశాలయందు జరిగినది. "ఉభయ భాషా ప్రవీణ" ఆంధ్ర విశ్వవిద్యాలయము ద్వారా నందినారు. శ్రీ ఆకుండి వెంకటశాస్త్రి, పేరి వెంకటశాస్త్రి, దువ్వూరి వెంకట రమణ శాస్త్రి గారులు వీరి గురువులు.

## ఉద్యోగపర్వము & సాహిత్యసేవ పర్వము :

❖ కాకినాడలో 1933–39 వరకు శ్రీమతి బాలాంత్రపు శేషమాంబ వారి మహిళా సంస్కృత పాఠశాలలో ప్రధాన ఉపాధ్యాయునిగా పనిచేసినారు.

- 1940–1946 సిబిఎన్ ప్రాథమిక బాలికోన్నత పాఠశాలలో తెలుగు పండితునిగా పనిచేసినారు.

- 1947 సం॥లో "మల్లాది సత్యలింగ నాయకర్ ఛార్టీసు నందు" సీనియర్ తెలుగు పండితునిగా నియమితులై 1972 సం॥లో పదవీ విరమణ చేసినారు.

- "ఆంధ్రసాహిత్య పరిషత్తు" కాకినాడలో పుస్తక ప్రచురణ – ప్రచారములో సహకారమునందించిరి. "ఆంధ్ర సాహిత్య పరిషద్పత్రిక" ప్రచురణలో సహకరించినారు.

- ఈ కాలములోనే ""సూర్యరాయ ఆంధ్రనిఘంటువు 3,4,5,6,7 సంపుటముల నిర్మాణములో పాల్గొన్నారు.

- 7వ సంపుటము అనుబంధ శుద్ధ ప్రతిని శ్రీ ఆకెళ్ళ శేషాద్రి, సామవేదం శ్రీరామమూర్తి గార్లతో కలసి 1972లో పూర్తి చేసిరి. – ఆంధ్ర సాహిత్య పరిషత్తు సహాయ కార్యదర్శిగా కూడా పనిచేసినారు.

- 1966లో శ్రీ జటావల్లభుల పురుషోత్తముగారి ఆధ్వర్యములో ప్రారంభించిన "శ్రీ వేణుగోపాల సంస్కృత ప్రచారసభకు" తమదైన సహాయ సహాకారములు అందించిన పండితులలో వీరొకరు.

- కాకినాడ – జగన్నాధపురములో చాలాకాలము "మల్లాది వెంకట రామయ్యగారి" పేరిట జరిపించిన "సంస్కృతగోష్ఠి" కార్యక్రమాలను వీరు నిర్వహించినారు.

- 1966లో ఆంధ్ర విశ్వ విద్యాలయ భాషా ప్రవీణ ప్రవేశ పరీక్ష శిక్షణకు స్థాపించిన పాఠశాల నిర్వాహణలో వీరు తోడ్పాటు నందించిరి. తదనంతరము అది ""పైండా సత్యనారాయణ మూర్తి సంస్కృత విద్యాపీఠముగా ప్రసిద్ధి నొందినది.

## సారస్వత రంగము :

ఈయన రచనలలో ఖండ కావ్యములు, చంపూ ప్రభంధములు, జీవిత చరిత్రలు, చిన్నకథలు, ఉపవాచకములు, శతకములు కలవు.

వీరి సాహిత్య విమర్శనావ్యాసములు ఆనాటి "కృష్ణాపత్రిక", "భారతి", "ప్రభుద్ధాంధ్ర", "హిందూసుందరి", "ఆంధ్రపత్రిక", "ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక" మొ॥ వాటియందు ప్రచురించబడినవి.

## రచనలు, ఖండకావ్యము:

❖ **"హారతి"** (1937) (అలభ్యం)

❖ **"జీమూత వాహనుడు"** (1940) – 1941–46 వరకు బి.ఎ., ఇంటరు పాఠ్యముగా మద్రాసు, ఆంధ్ర, ఉత్కల విశ్వవిద్యాలయ ములలో

❖ **"జడభరతుడు"** (1950) – 1950–1955 వరకు బి.ఎ. పాఠ్యముగా ఆంధ్ర విశ్వవిద్యాలయములో

❖ **"అహల్య"** (1956) – 1957–1960 వరకు బి.ఎ. పాఠ్యముగా ఆంధ్ర విశ్వవిద్యాలయములో

❖ **"భక్త శబరి"** (1957) – 1968 – పి.యు.సి. పాఠ్యము ఉత్కల విశ్వవిద్యాలయము.

## చంపూ ప్రబంధములు : **(నీలకంఠ దీక్షిత కవి సంస్కృత ప్రబంధములకు అనువాదములు)**

❖ **"నీలకంఠ విజయము"** (1959)

❖ **"శివలీలార్ణవము"** (1968)

## జీవిత చరిత్రలు :

❖ **శ్రీమతి బాలాంత్రపు శేషమాంబ జీవితచరిత్ర** (1953)

❖ **శ్రీ వ్యాకరణాచార్య పేరి వెంకటశాస్త్రి జీవిత చరిత్ర** (1958)

**శతకములు :**

- “శ్రీ మల్లేశ్వర శతకము” (1930)
- “హనుమత్త్రింశతి” (సంస్కృతము) (1975)
- “దుర్గాశతి” (1975)

**ఇతర రచనలు :**

- “ఋతుచర్య” (1970)
- “ప్రబోధసుధ” (1972)
- “కుందమాల” (1978)
- “శతరుద్రీయము” (1980)

**ఉపవాచకములు :**

- ధన్యజీవులు, మణిమంజీరము, నాలుగు కథలు, మణిమాల, బుద్ధ బోధలు, మూడు నక్షత్రములు, భాస నాటక కథలు.

**తొలికథలు :**

- ధనమ్మ గుడి (1937 హిందూసుందరి)
- ఉడుకుమోతు (1937/9 హిందూసుందరి)
- రాదారి పడవ
- అగ్గిపెట్టెలవాడు



# బిరుదములు

శ్రీపాద కృష్ణమూర్తి మహాకవీంద్రుచే "రసవత్కవి" బిరుదు రక్తినంది
సీతానగర సభన్ చిరతరానందుచే "కవిశిరోమణి" యన్న ఘనతనంది
అల హసన్బాద్ సభయందు కోవిదులచే "పండితకవి" అన్న ప్రతిభనంది
వరజటావల్లభ పురుషోత్తములచేత "కవికోకిల" అటన్నఖ్యాతి నంది

ఆంధ్రవిశ్వవిద్యాలయార్హతలయందు
"ఉభయభాషాప్రవీణ"తనొందియుంట
జనని! నీకృపావేశసంసర్గకాదె
వందనములుగీర్వాణాంధ్రవాణి! నీకు



# అర్పణము

ఆశ్రయించిన దాది యాదరమ్మునుజూపి
యేసాధ్వి నన్ను మన్నించిచూచె,
నాదు బాగోగు కన్నారఁ దాఁ గనిపెట్టి
యేసతి యాధారమిచ్చిప్రోచె
నా కష్టదశలందు నను బిడ్డగానెంచి
యేయమ ధైర్యమందిచ్చికాచె
నాసంతు తనసంతు నా భావముననెంచి
యేతల్లి వృద్ధిపొందించి పెనిచె
నట్టి ధార్మికురాలు, దివ్యాంతరంగ,
సదమలచరిత్ర, పతిభక్తి సహితయైన
రమణి, కావలి వేంకటరత్నమాంబ
కంకితముసేతు నీచిరు కావ్యమిపుడు.

(మూర్తి)

# మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ
# తాతా సుబ్బరాయశాస్త్రి గారి
# అభిప్రాయము

శ్రీ దువ్వూరి సూర్యనారాయణ శాస్త్రి గారు రచియించిన పితృభక్తి యను గ్రంథమును చాలా భాగములలో సావధానముగ చదివితిని. గ్రంథము సరళమైన శైలిలో నుండుటచే చాల సుబోధముగ నున్నది. అందు విషయము ప్రాజ్ఞులకుగూడ సదుపదేశము చేయదగియున్నది. వినినవారి కెల్లరకును భక్తిభావమును పురిగొల్పును. రసమునుబట్టి జనాకర్షకమై ధర్మోపదేశమును చేయునది కావ్యమను ప్రాచీనాశయమున కియ్యది అనుకూలమగు గ్రంథమని ధృఢముగ విశ్వసించు చున్నాను.

**తాతా సుబ్బరాయశాస్త్రి**

మహారాజాస్ శాన్స్క్రిటుకాలేజీ,

విజయనగరము

ది, 3-11-38

# పితృభక్తి

కలడు నిజకీర్తి నర్తకీ కర్ణకలిత
కుండలీకృత రవిశశి మండలుండు
భవ్య పితృపాదపద్మ సేవావిధాన
నిత్య నీరాజితాత్మ నిర్నిద్ర గుణుడు.

అతడు నిరతాన్నదాత దయామయైక
పూత నవనీత జీవిత పూర్ణమూర్తి
బధిర పంగ్వంధ భిక్షుక ప్రభృతులైన
దీనగణముల పాలిటి దేవుడతడు.

అత డాకొన్నవారల కమృతమయుడు
భయద రోగార్తులకు సుప్రభాకరుండు
'నా' అనెడి దిక్కులేని యనాథజనుల
నుద్ధరింపగా పుట్టిన బుద్ధుడతడు.

అతడు రాజాధిరాజ మార్తాండుడయ్యు
మణిమయ కిరీట కేయూర మాన్యభూష
ణముల దాల్పడు; చీని చీనాంబరముల
కట్టియెరుగడు ముచ్చటకైన నెపుడు.

అతడు జీమూతకేతు గర్భాకరమున
నవతరించిన పుత్రరత్నాంకురమ్ము
వేదవేదాంగవేత్త కోవిదవరుండు
అందురతని జీమూతవాహను డటంచు

రాజ్య భోగంబులెల్ల నిరాకరించి
నిత్య సుఖములనెల్ల తృణీకరించి
అహరహము పితృదేవతారాధనమున
కాలమును బుచ్చుతనడు లోకంబెమరచి,

స్వీయ రాజ్యార్ణవమ్ములు వెల్లివిరిసి
దిగ్విదిగ్భిత్తికల ముంచి తేల్చుచుండ
లెక్కయేలేని యట్టి నిర్లిప్తుడతడు
సత్యమూర్తి విద్యాధర చక్రవర్తి.

గుండె లగలించి చూడ నేకోశమందు
సుంతయేని కాఠిన్యంబు చొరగనీని
ఆర్ద్రపుటెడంద; ఆతనియాత్మనియతి
బ్రహ్మ దుర్భేద మతని కాప్రభువెసాటి

అతడు గాయక గానసంగతులు వినడు
అంగనాజన నర్తనం బరసి కనడు
వందిగణము లొనర్చు కైవారములను
చెవినిబెట్టడు నిస్పృహచిత్తుడతడు.

రాజచిహ్నములట లాంఛనంబునకయి
జరుపబడుచునుండు సక్రమముగ
ప్రభువు సేవకుడను భావమేలేదట
సర్వసమత బుద్ధిఁజక్కబడుట.

అతడు ముష్కరతరుణ వయస్కుడయ్యు
మురిపెముంగొల్పుమోహనమూర్తి యయ్యు
పృధివిశాసించు నొకరాజబిడ్డడయ్యు
ఎదదలంపడు వైవాహికేచ్ఛ నెపుడు.

పెట్టిపోతలకై తానుపేదవాడ?
అంగవైకల్యుడా? సహాయంబులేని
యొంటరియ? ఏమియాతని యూహయౌనొ
కానిగార్హస్థ్యమన్న నెక్కదు మనంబు.

తల్లిదండ్రుల ప్రత్యక్ష దైవతముల
వలెనె భావించి యాత్మసువర్ణపీఠి
నిలిపి యర్చించు టాతనినిత్యవృత్తి
దైవతములకు దైవముల్ తండ్రులగుట.

దేహదార్ఢ్యంబు సడలిన దీనులగుట
పెద్దకాలంబుగడచిన వృద్ధులగుట
భ్రాంతులుడిగిన పలిత శిరస్కులగుట
తల్లిదండ్రులకై తాను తల్లడిల్లు.

పండిపరువంబు మీరిన ఫలములివ్వి
అవనిరాలగనున్న కారాకులివ్వి
సౌరభంబేది వృంతవిశ్లథములైన
పువ్వులని పితరుల తలపోయునతడు.

బ్రతికినన్నాళ్ళు బ్రతుకుదురా? మఱింక
తినినయన్నాళ్ళు తిందురా? తీరిపోయె
ననుచు తా ముదుసళులకై యనవరతము
బెంగగొను నాత్మలోన బెంబేలువోవు.

పితరులనుగాంచి యొక్కప్పుప్రీతినందు
వారివార్ధకదశగని వగను బొగులు
నిత్యులావీరు? మృత్యుసన్నిహితు లనుచు
మరణముతలంచి యాత్మలో క్రుగ్గుచుండు.

అతని కెడనెడ పితరుల నరయునపుడు
వారివౌ భూతపూర్వ యౌవనపటిష్ఠ
దశలు తిరిగి(ప్రాప్తింపరాదా తమంత
అనెడునాశలు వొడమెడు నాత్మలోన.

ఆత్మజీవిత భాగంబు నంగరక్ష
వెట్టి పదికాలములపాటు పెంచుమయ్య
అనుచు పితరులగూర్చి నిత్యమును చేతు
లెత్తి దేవాదిదేవు (ప్రార్థించునతడు.

ఇట్టిబెంగలె హృదయము నేచిపెనగ
అనవరత వేదనాందోళితాంతరంగు
డగుచు బడుగయ్యెనతడు ధైర్యంబుసురిగి
మతిమనోవ్యాధి కెందైన మందుగలదె.

రాజ్యభారంబు రాజతంత్రమ్ములెల్ల
మంత్రులే పూనినడుప నీమాన్యుడెపుడు
అనవరత పితృసేవా పరాయణత్వ
భాగ్యమున పరమానంద భరితుడగును.

ఇట్టిపుత్రుని వైఖరి నెరిగి జనకు
లాత్మలోగుంది యొక్కనా డతనినంట
శయ్యపై జేర్చి (ప్రేమహస్తముల నివురు
చిట్టులాత్మ గతం బెరింగించుకొనిరి.

నాయనా! మేము మరణసన్నాహములను
చేయుచుంటిమి ఆయువు చెల్లినట్లె
ఆదరించెడి బిడ్డవీ వందివచ్చి
కన్నులను కప్పుకొని మమ్ముకాచుచుంటి

ముసలివారలమై యుండి పుత్రకులను
పుణ్యభాగ్యంబు లిమ్మన బోముకాని
ఆదరించుచు వేళకింతన్నమిడుచు
పిలువపలుకుటయే పదివేలుమాకు.

కన్న గర్భవాసంబనిగాని మేము
పెంచి పెద్దగజేసిన ప్రేమచేత
గాని, వార్ధక దోషానగాని మీకు
చెప్పినదె చెప్పుదుమది యోజింపవలయు.

చాగఁగాటికి ఁగాళ్ళను చాపుకొన్న
మాకు బాధాకరంబు మీమాటెయగును
ఐహికస్వర్గ సౌఖ్యంబులనుభవింప
మాకు సంతోషకరము మీమాటెసుమ్ము.

కాలగంభీర వాహినీ గర్భమందు
కొట్టుకొనిపోయి రెందరో కోట్లకొలది
జననమిచ్చిన దేవుడే చావుపెట్ట
దానినిర్జించు టెవ్వరితరము తండ్రి.

ప్రాణిసహజమౌ మృత్యువున్ పరిభవించి
యుట్టికట్టి యూరేగిన దొకడు లేడు
కానిదైవము మాఅంత్యకాలమునకు
చింతలను బాపి మాఆకుచింపడాయె

భుక్తి కా లోటులేదు, సంపూర్ణరాజ్య
భోగములు కొరవడవు, సుపుత్రకుండ
వీవు మమ్మరచేతిలో నిడికొనుచును
పెంచి లాలించుచుంటి వేబెంగలేక.

కానియొక్కటి తలపోయగా మనంబు
ఆపగారాని వేదనమంది గుందు
వయసునకు పిన్నవైన నీ వరుసకనిన
అకట హృదయ విదారకంబగును కొడుక.

అవనిపతులెందరంటో గంపెడాసపడుచు
కోరిమనతోడి వియ్యమ్ముకొఱకు స్వీయ
పుత్రికారత్నముల చిత్రములను బనుప
కంటితోచూడ విదియేమి కర్మమయ్య.

సకల కామార్థసిద్ధికి సాధనంబు
సర్వయాగ ఫలప్రాప్తి సాధకంబు
భవ్యపితృ తారకంబు వివాహమట్టి
పరమ ధర్మకృత్యము వీడభావ్యమగునె.

తెలియ దేనాటిదో అస్మదీయవిమల
వంశ జీవస్రవంతీ ప్రవాహమిపుడు
నీదునవివాహితా గోత్రనియతిచేత
కట్టువడిపోయె నేమందు కన్నకొడుక.

ఈవిచారంబుచే క్రుంగిపోవుచున్న
మాకు (నాత్మ)శాంతిని చేకూర్చుమాకుమార,
పెద్దతనమందు బెంగలు పెనగొనంగ
నదె మనశ్శల్యమగు మరణాంత మగును.

అనుచు గుండెలు కరగున ట్లాత్మజునకు
బాష్పరుద్ధ నేత్రములతో పలికినంత
ప్రేమతొనకాడ దగ్గత్తి పెనగులాడ
వారికిట్లనె జీమూతవాహనుండు.

కష్టములనోడి వడబోసికాని, మిగుల
ననుభవజ్ఞుడ నేనని యనుచుగాని
పలుకువాడనుగా నిట్టివయసునందు
చీకుచింతలమీకు గ్రుశింపులేల?

అమలభవదీయ పాదపద్మార్చనమున
కల్గునానంద మేకడకాంచనేను
త్రిజగతీరాజ్య వైభవ దీపితములు
దివ్యభోగంబు లెన్నైన తృప్తికనను.

నాకుభవదీయ సన్నిధానస్థ సుఖము
అతుల స్వర్లోక నందనోద్యానవాట
కల్పపాదప చ్ఛాయా సుఖాంతనిద్ర
నాకదె త్రిలోకసుందరీ నాట్యసీమ.

మీపురోవర్తినై పొందుమేలి సుఖము
దివ్యనవరత్న కిరణ దేదీప్యమాన
హాటకమహార్ఘ రాజ్యసింహాసనమున
నుండియును పొందబోవ నేమున్ననేమి.

మీకనులముందు నిల్చి సమీహితార్థ
కృత్యముల దీర్చుచుండ నాకెట్టితుష్టి
యబ్బునోయది ఆసుధర్మాంతరమున
నుండియును పొందగా నోపనోయితండ్రి.

భవ్య భవదీయ పాదసంవాహనంబు
సలుపునప్పుడు నేపొందు సంతసంబు
సర్వసర్వంసహా రాజ్యచక్రమెల్ల
ననుభవించుటలో కాననైతితండ్రి.

ధరనుతావక భుక్తోజ్ఝితములెనాకు
అమృతమయములు పంచభక్ష్యాన్నములగు
క్రమభువనత్రయోప భోగమ్మునందు
సైత మారుచి కానంగజాల తండ్రి.

పూనిదుఃఖోప హతులైన దీనజనుల
రక్తదిగ్ధము రాక్షస రాజ్యసుఖము
నిత్యహింసా రిరంసా వినిద్రితమ్ము
ఇట్టి రుధిరాన్న మెవ్వడాశించుతండ్రి.

నాకుమిమ్ముల విడిచిన నాటి సుఖము
నాకలోకాప్సరోంగనా నందకలిత
యుగపదాలింగ నోత్సవం బగునుగాక
ఎద తృణప్రాయముగను భావింతు తండ్రి

భవదమల వాక్సుధారస పానమత్త
మన్మన శ్చంచరీక మున్మత్తమగుచు
మాన్యభవదీయ పాదపద్మాంతరమున
మోదగీతాలపాడి కన్మోద్చు తండ్రి

మీవలన బొందునట్టి యమేయసౌఖ్య
సాగరమ్మున తుచ్ఛసంసార సుఖము
బుద్బుదప్రాయ మీరాజ్యభోగమెల్ల
కంటకమ్మగు నాకిట్టి కర్మమేల

ప్రబల ప్రాపంచిక క్లేశభారభుగ్న
మానసిక దుఃఖ దోదూయమానుడైన
యీనరుండెప్పుడో సుఖియించుకొరకు
గాదె గార్హస్థ్య మెవ్వరికైన తండ్రి

మీ విధేయ కింకరుడనై మెలగుచుండి
యట్టియానంద సందోహ మందుచుండ
లేనిపోని బాదలబందులేల మనకు
స్వర్గమున నుండ నటగూడసవతిపోర?

అపరిచితమైన యొకనూతనాత్మవచ్చి
పరిచితాత్మలతోడి సంపర్కమంద
క్షీరనీరముల్ కలసిన తీరెయౌనొ
కాకతిలతండుల విధంబుగాగ నౌనొ?

అట్టిసంసృష్టియే మనకైనయెడల
నాటినుండి మహాదుఃఖ నరకయాత
నానుభవ మిహమందె నిర్నయము తండ్రి
వలదు మన కేల, ఆమందభాగ్యదశలు.

కానసుఖముననున్న యీప్రాణములను
దుఃఖమున బెట్టుకొని యిట్లుద్రుంగనేల?
నాప్రశాంతనిర్మల జీవనస్రవంతి
బరుగులెత్తించి కల్లోల పరుపనేల

ఇంతకును యోగమున్నచో నెవ్వరైన
కాదనెడి వారలుందురే కన్నతండ్రి?
దైవఘటన మెప్పటికేదొ తప్పదుకద;
దీనికై నేటినుండి చింతిల్లనేల.

అనివచింపగ సుతుపల్కు లాలకించి
పలికె జీమూతకేతు దర్భకునితోడ;
నాయనా యిట్టి యౌవనానందసమయ
మడవికాచిన వెన్నెలై నట్లొనర్తె?

వార్ధకంబున మాకుండవలసినట్టి
యింతటి విరాగవృత్తి నీకేలనయ్య?
ఆసముద్రక్షితీశుల మగుటయెల్ల
నీకొఱకెగాదె ధర్మవినిద్ర హృదయ!

**జీమూతవాహనుడు**

నాయనా! దేహధర్మమై నవయుచుండు
దశలకై భోగతృష్ణల దగులనేల?
యౌవనంబు పరోపకారార్థ మనియె
దైవనియతంబు దానిని దాటనేల.

ఆసముద్ర క్షితీశుల మగుటయెల్ల
ఆత్మకుక్షింభరిత్వానకగునె తండ్రి?
ధర్మపాలనమున ప్రజాదరణ మొంది
ధారవోయవె నీయనంతరుల కెలమి

ఆత్మపాత్ర రాగాపూర్ణమైనయెడల
సర్వమాత్మోప భోగ్యమై సరసమగును
వీతరాగుని యాత్మకీ విశ్వమెల్ల
నీరసంబగు పిప్పియై నెగడుగాదె.

**వృద్ధదేవి**

కొడుక! మాచిత్తశాంతిని కోరినీవు
మమ్ముసుఖపెట్టతలచితి సమ్మతంబె
కాని, నీవువివాహ సంగతికితొలగి
యున్నమాకేటి శాంతిరా కన్నతండ్రి.

నిన్నుచూడ గర్భనిర్భేదగుచుండె
ఆశలిన్నియును నిరాశలయ్యె,
తల్లిప్రాణినిట్లు తల్లుడపరుప, న
ధర్మమంచు తోచదా కుమార

కొడుకుగల్గినాడు కోడలువచ్చును
పౌత్రవర్గమింట పరుగులిడును
కరువుతీరగాంతు కన్నులవైకుంఠ
మనెడి కోర్కెలన్ని యంతరించె.

కొడుకెయాశింప నట్టి యీకోటలేల?
తనయునకుగాని యీతల్పు తతులవేల?
పుత్రుడొల్లని యీరాజ్యభోగమేల?
ఆత్మజత్యక్తమైన యీయవనియేల?

కానతృష్ణనుడిగి కానలయందె యీ
జీవితంబు గడుపజెల్లు మనకు
ఆర్యపుత్ర! వట్టియడియాసలను మాని
యెద విరక్తిచెందు డింకమీరు

**వాహనుడు**

లక్కవంటిదిగద తల్లి, రాయివంటి
వాడు బిడ్డనికాదె సుభాషితమ్ము;
అమ్మ! నీవిట్లు కోపింప నౌనటమ్మ?
నాకుస్వర్గము మీతోడిదే కదమ్మ

**వృద్ధదేవి**

కోపగించినిన్ను కొట్టితినా యేమి
రా, అనుశ్రుతము తలంచితంతె
అడవులందు నాకులలములుదిని ముని
వృత్తినుంట ధర్మవృత్తి మాకు.

నీకుమేమెట్లొ నీవును మాకునట్లె
మాటలనుగాక చేతల మసలుచున్న
భువి కుపుత్రుండు జనియించుబో కుమాత
పుట్టలేదు, పుట్టదు వెట్టిపుత్రకుండ

తల్లికోపముడుగు తనయు డమ్మాయని
నోటినిండ పిలిచి నుడివెనేని;
భువి కుపుత్రు కోపమో పగపట్టిన
త్రాచుకాటు బోలురా కుమార.

పుత్ర! పూజకొలది పురుషుడు, దానము
కొలదిబిడ్డలను నిగూఢభాగ
ధేయమెవరికెట్లు దేవుడు వ్రాసెనో
అదియవశ్య భోగ్యమగునుగాదె.

చెలగివాక్కాయ కర్మములను పరాత్మ
నెపుడు నొప్పింపకయె చెరియింతువేని
నీదుసర్వంబు పరులకై నెగడెనేని
నీదయావీర మానాడె నెగ్గునయ్య

బిడ్డ! మాయిష్టమిద్ది, నీవివేకబుద్ధి
నెంచినీలోన నీవె తర్కించుకొమ్ము
ధర్మసందిగ్ధమైన కృత్యములపట్ల
ఆత్మబుద్ధి సుఖావహం బగునుగాదె.

**వాహనుడు**

నా మనస్తత్వ సంభావనాతిదూర
మగు వివాహంబె మీకిష్టమైన యెడల
తాతపాదుల విధినెట్లు దాటగలను
గురులబుద్ధి విశేషంబు గూర్చుగాదె.

అమ్మ! మీవిచార మడుగంట తెగతెంపు
చేసి నిర్వికంక చిత్తులగుడు
మీ కనిష్టమగుడు మేలైన కీడైన
నెపుడుచేయ నుత్సహింపనమ్మ.

కానియొకచిక్కు తీరిపోగా మఱొండు
దాపురించుచునుండె నాతల్లికాన,
అడవులను మాట తలపోసినంత గుండె
జల్లని విదీర్ణమయ్యె నశాంతివొడమె

ఘోరమృగ భీకర నినాదఘూర్ణితములు
నరక కోలాహలాతి భుగ్నములు, నిత్య
మృత్యుముఖగహ్వర నివాస హృదయభేద
భయదగహనము లేడ, మీపయనమేడ?

కంటకావృత పాషాణకలిత, విషమ
దావపావక జ్వాలా విదహ్యమాన,
విషధర విశీర్ణమార్గముల్ విపినతలము
లకట, మనమేడ? ఆగహనాంతమేడ?

హంసతూలికా శయ్యాసనాదులందు
నిత్యసంవాహనోచిత నియతవృత్తి
తనరి శుష్కములై పలితంబులైన
మీతనువులేడ? వనవాస పాతమేడ?

జనని! కాలాతిపాత దుస్సహములగుచు
భుక్తికై సోలివోవు మీశక్తులేడ?
వేళపాళలెరుంగక విపినవృక్ష
పతితఫలవర్గ భక్షణ భారమేడ?

పంచభక్ష్యాన్నముల భుజియించియింట
ఎండకన్నెరుంగక హాయినుండుమీరు
కందమూలాశనంబుల గ్రాలియెట్లు
విపినముల మండుటెండల వేగగలరొ?

### జీమూతకేతుడు

పూతవంశ పరంపరా యాతములగు
విధివదాశ్రమ ధర్మముల్ వీడనగునె?
కొడుకుకనిపెట్టు చుండ నట్టడవియైన
ఇంద్రభోగాయతన మనిపించుగాదె.

కష్టనిష్ఠుర సంయతిఁగాక ధర్మ
కర్మనిర్వహణమ్ము సౌఖ్యములనగునె?
గ్లానియంచు ధర్మవ్యతిక్రమము సేత
దురితమనిగాదె మునుల వైదుష్యఫణితి.

షష్ఠిపూర్తియయ్యె సంసార బంధముల్
దగిలియింటనుండ తప్పుమాకు
వార్ధకమ్మునందు వనవాస మొనరించి
జీవితాంత మచటె చెల్లవలయు.

### వాహనుడు

నాన్న! మీరిట్లు ధర్మనిర్ణయ మొనర్చి
కఠినవనవాస జనితదుఃఖములనుండ
నేనుభోగినై రాజ్యమున్ నెత్తిపెట్టు
కొని సుఖంచుటా? నాకట్టి కోర్కెవలదు.

ఆదినుండియు మీచెంత నాకుచాటు
పిందెనై మీదునీడల పెరిగినాడ,
గోవుతోడిదె వత్సమ్ము, కొమరునకును
తల్లిదండ్రుల జేరుటే ధర్మపథము.

తల్లిదండ్రులు బాధావిధాన మధిత
ధర్మమార్గానుయాయులై తనరుచుండ
నన్నుకానట్టు లింట నానందవశత
సుఖము మరగినవాడెట్టి సుతుడుతండ్రి?

మీకు గహనాంతవాసము, నాకుపురిని
రమ్య సౌధవాసమ్ము, ధరాతలంబె
మీకుశయ్యా పటం బింటనాకు దివ్య
రత్నకంబల శయనంబులా? మహాత్మ.

కందమూల పత్రాశన కాంక్షమీకు
ఇక్కడ సువర్ణభోజన మింటనాకు
దిక్కుదీవెయులేక ఖేదిలుటమీకు
వలితపరివారి నగుచు మోదిలుటనాక?

చిక్కిదిగనారి శల్యావశిష్టముగను
దేహమోహంబు లుడిగించు దీక్షమీకు,
కండపై కండలను పెంచి కనకదీప్తి
దేహమోహంబులను పెంచు దీక్షనాక?

తండ్రి! తావకదేహరక్తముల బీల్చి
మీధనద్రవ్యముల దిని మీదయార్ద్ర
పుణ్యపోషణముల పరిపుష్టినంది
నట్టి, మాదేహములు మీకువెట్టిగావె.

కోటిజన్మలెత్తికొనివచ్చి మాబిడ్డ
తరతరమ్ము సేవ నెరపుచున్న
గిరులు నుదధులగుచు పెరిగిన పిత్రూణ
మెవడుతీర్చి నిగ్రహించెనమ్మ?

ఏహ్యమై, నింద్యమై, జ్ఞానహీనమైన
పశువెయగుగాక కుక్క, తా పట్టెడన్న
మున కపేక్షించి జీవితమున్నవఱకు
భక్తి చూపదె తనపెంచు వారిపైన.

అట్టిచో జ్ఞానసంపన్నమౌ మనుష్య
జన్మమెత్తి, మీకడుపున జననమంది,
మీదుసర్వస్వమును తిన్నమేము మిమ్ము
మరువవచ్చునె జన్మజన్మాంతరముల.

కానకష్టమో సుఖమొ మీకడనెయుంట
పరమ సంతోషముగను గన్పట్టునాకు,
అడ్డుచెప్పక యీనిర్ణయమ్మునిట్లె
జరుగనిండని యాత్మనిశ్చయము తెలుప.

అంతలో స్నానకాల సూచ్యంబులగుచు
పటుపటహ ఢాంఢమధ్వనుల్ ప్రజ్వరిల్ల
కాల్యముల దీర్ప నాప్రసంగము ముగించి
అపుడు ముువ్వురునేగి రభ్యంతమునకు.



అది కీకారణ్య మాదిమధ్యాంతశూన్య
మై, యగాధ మహార్ణవ మనగజెల్లు
అచట సుఖదుఃఖములును భయాభయమ్ము
లేకమై జతగూడి వర్తించుచుండు.

అయ్యది పరాత్పరుని గభీరాంతరంగ
భావనాకల్పిత నిసర్గ భవ్యసర్గ
మది విశాలభూదర్పణమందు నిండి
ప్రతిఫలించిన యతిలోక ప్రథమసృష్టి.

అయ్యది త్రిలోక యవనికాభ్యంతరమున
షడ్గుణ విచిత్రధాతు సంసర్గమంది
చేత విధిశిల్పి వ్రాసిన చిత్రసంచ
యమున రమణీయ ప్రకృతిదృశ్యముగదోచు.

అది చరాచర సత్వవిహారములకు
తొలిచియుంచిన దుర్భేద్య దుర్గసీమ
భయద ఘాతుక మృగపరివారవీర
రాజసింహ పాలితమైన రాజ్యమద్ది

అది కులాయవిలీన విహంగతతికి
మహిత సౌఖ్యప్రసుప్తిక మాతృగర్భ
మద్ది వికసితసురభిళాహ్లాద కుసుమ
సంతతికి నవ్యదివ్య వసంతసీమ

అదిగుహాశయ గాఢనిద్రానుసక్త
వ్యాఘ్రశరభాది జంతు శయ్యా గృహంబు
అజగర భుజంగమాది ఘోరాహితతతి, ని
మీలయోగ్య ప్రభూత వల్మీకమద్ది.

అద్దికోకిల భ్రమర గాయకుల కెల్ల
లలితగాన ఘూర్ణిత త్యాగరాజభవన
మది మయూరనటీనటనానుకూల
దైవనిర్మిత రమ్యనర్తనపు శాల.

అద్ది ఆ గగనాంతర వ్యాప్తవృక్ష
సైన్యతతికి పద్మవ్యూహ సరణియగును
వివిధ సుమ తరుగుల్మినీ నివహమునకు
నవ్యగంధమ్ములొలయు నందనవనమ్ము

అయ్యది సమస్త దేశ విఖ్యాతవివిధ
భోగ్యఫల జాతికెల్ల నమూల్యవిపణి
ప్రాణికోటికి దాస్యనిర్బంధ దుఃఖ
రహితమౌ స్వరాజ్యమునకు రాజధాని.

అది క్షణ క్షణాపాయ దురంత నరక
భూరిబాధాను భూతికి పుట్టినిల్లు
అది విశృంఖలహారి విహారహార
భాగ్యభోగాను భూతికి స్వర్గసీమ.

అద్ది కలహంస శుక శారికాంగనలకు
తరణికిరణము చొరని యంతఃపురమ్ము
ప్రకృతిసాంఘిక సరసరూపక ప్రదర్శ
నానుకూలమౌ రంగస్థలాంతరమ్ము

అద్ది మలయాచలేంద్ర ప్రత్యంతరమ్య
భయరహితమైన ఆశ్రమావాసభూమి
అచట పరిముక్త సంసారులైన మునులు
నిర్వికల్ప సమాధిని నెరపుచుంద్రు.

అచటి చందనతరులు నిరంతరమ్ము
బాహుశాఖల కిసలయ వ్యంజనములు
పూనివీచుచు వనవాస మౌనివృద్ధ
వరులకు సపర్యలొనరించు వాంఛనుండు.

పుష్పవతులౌ లతాంగనల్ మునులకచట
ఎంచి పూజాసుమంబు లర్పించు చంద్రు
అట తమాలఛత్రగ్రాహు లండజేర్చి
నీడల నొసంగి మునిసేవ నెరపుచుంద్రు

అచటి కడిమిడుల్ తృణరోమ నిచయరమ్య
హరిణతాపస శయన చిత్రాసనములు
అచట గిరినిర్ఝరములు పద్మాకరములు
స్నానపానాద్యనుష్ఠాన సౌఖ్యదములు.

ఆ నదీమాతృకలు పయఃపాన మొసగి
సైకతోరస్థలమ్ముల సాకిసాకి
అలల జిలిబిలి జోలపాటలనుపాడి
విహగసంతతి లాలించి పెంచుచుండు.

అచట భీకరదృక్కుతో నడవినెల్ల
శిరసులెత్తి వీక్షించి శాసించునట్లు
అచలగజపతు లభ్రం లిహాగ్రభాగ
ములను ప్రాణిభయోత్పాతమునుఘటించు.

కుసుమకోమల నిబిడ నికుంజతతులు
అచటి వనదేవతలకు విహారశాల
లట దిగంతవిశాల మహావటములు
తీర్చిదిద్దిన చలువ పందిళ్లగములు.

అచటి కనతిదూర మందున్న నొకకొండ
కోనయొద్దనందు తానుభార్య
కొడుకుసేవ లందికొనుచు, జీమూతకే
తుడు వసించు లోకదూరు డగుచు.

అనుదినమ్ము ప్రత్యూషమ్మునందులేచి
స్నానసంధ్యాది నియమముల్ సంతరించి
స్ఫాటికంబగు జపమాల చక్కబట్టి
జపతపంబులు దీర్చు నా చక్రవర్తి.

ఆయనంతర మతడు నిత్యాగ్ని గొలిచి
దేవతార్చన విధులెల్ల దీర్చియవల
భూతబలులిచ్చి నైవేద్యమును నొనర్చి
వేళకు భుజించి యొకకొంత విశ్రమించు.

పిదప మునిపల్లెలో కులవృద్ధులెల్ల
ధర్మశాస్త్ర పురాణ బోధమ్ముసలుప
కోరియట కేగి మునుల సద్గోష్ఠివినుచు
పరమ సంతుష్టినందు నాభాగ్యశాలి.

తనదు సర్వస్వ మొరులకు ధారవోసి
రాజ్యమొల్లక భోగలాలసుడుగాక
పరమనిష్ఠను జీమూతవాహనుండు
కలితపితృవృద్ధ సేవాగ్రగణ్యుడయ్యె.

ఆతనికి పితృసేవా విహారమందు
ఆకలియెలేదు దాహమే యంతరించె
స్నానపాన భోజన విధానమ్ములందు
కాలమానమ్ము లెరుగడా కారుణికుడు.

చల్లని ప్రభాతవాయు సంస్పర్శనమున
లేచిపితృపాద వందనమాచరించి
కాల్యములదీర్చి సిద్ధసంకల్పుడగుచు
పితరుల ప్రభోధకై తానువేచియుండు.

వారుమేల్కొన్న దంతధావనలు దీర్ప
తగిన సంబారములను సంధానపరచి
స్నానకాలమ్మునకు నుష్ణజలములొసగి
రాజభోగమ్ము నెఱపు నా రాసుతుండు.

ఆజరా జర్ఝరితమైన యట్టి తండ్రి
యొడలిపోయిన ముడుతల యొడలికతడు
(తైల సంస్కారమిచ్చి మర్దించి, యంగ)
కముల బడలికతీర చక్కగనుపట్టు.

సందెయగునంతనే సుఖాస్తరణములను
పఱచి జనకులు శయనించు తరుణమందు
విసరి కొండొకవడి, సుంత విసువుకనక
పాదసంవాహన మొనర్చు పరమభక్తి.

అర్చనకు పత్రపుష్పాదు లందియిచ్చి
కందమూలఫలాది సంగ్రహము సలిపి
హెూమములకు సమిత్కుశ స్తోమములను
కడక సమకూర్చు చుండు నాకష్టజీవి.

కొండవాగులకేగి యొక్కండు, మలిన
వస్త్రముల నుప్పళించి, కావలసినన్ని
జలములను దెచ్చియిచ్చి బట్టలను నెండ
నారవైచి స్నానముచేయ నరుగుచుండు.

దుర్లభంబైన ఫలమొందు దొరకెనేని
ఇద్ది మానాన్నకని దాచి యిచ్చుచుండు
అందమైన సుమమ్ము సంప్రాప్తమైన
తెచ్చిమా అమ్మకనుచు తానిచ్చుచుండు

అతడు వనచారియై యొంటి నరుగునపుడు
ఏదొ తనలోన తానె భావించుకొంచు
జన్మజన్మాల కోటియజ్ఞములు సలుప
నబ్బునేయిట్టి పితృసేవ యనుచు గొణుగు.

అతని కెటుచూడ నచటె ప్రత్యక్షమగును
సృష్టిచిత్రమ్ములను పితృసేవయొకటె
కాని యర్థముగాని శంకలకుజిక్కి
పరితపించు విజ్ఞాన సంభరితుడగుట

ఎంతవారికైన నీపరాసృష్టికి
భావబోధమేమొ పట్టుపడదు
దైవమాయయనుచు తానొక్కదినమున
ప్రకృతి శోభగాంచి పాడుకొనియె

### గేయము

మిణుగు రిక్కలతోడి
మిన్నువలె విరబూసె,
ఈవిపినతలమంతదేవా!
ఏస్వామి పూజకో
ఏమూర్తి సేవకో
ఎరుగజెప్పుము దేవదేవా!!

పండి పరువముమీరి
పడి రాలు చున్నవీ
అడవి పళ్లన్నియును దేవా!
ఏభవ్యమూర్తి, నై
వేద్యమ్ముకో నాకు
తెలియచెప్పుము దేవదేవా!!

ఈబిల్వ వనములో
ఎన్నెయో దళములు
ఎండివాడుచు నుండెదేవా!
ఏస్వామి కైంకర్య
మే దేవతార్చనకివి
ఎరుగజెప్పుము దేవదేవా!!

ఈ కొండవాగులివి
కలువ కన్నులువిప్పి
ఎవ్వరిని కాంచునో దేవా!
ఎన్నాళ్ళో యీమౌన
మెన్నేళ్ళో యీతపము
తెలియచెప్పుము దేవదేవా!!

ఊర్మి కోటులుచాపి
ఉరక లెత్తుచునీదు
ఉదధి యెవ్వరిజేర దేవా!
ఎన్నాళ్ళు లీదినను
ఎన్నేళ్ళు ప్రాకినను
ఏదిగమ్యము దేవదేవా!!

ఈబ్రదుకు తెరువులో
ఎన్నెన్నో యొడుదుడుకు
లెవరు దాటింతురో దేవా!
అడుగడుగు గండములు
అంధకార ప్రాయ
మాదరించుము దేవదేవా!!

జోతి రోచిస్సులకు, జోతపెట్టెడిజీవి
ఏదొ తినుబండమని, ఎగిరివాలెడి మిడత
బల్లినోటనుబడక, బ్రతికి యుండెడిరీతి
నిర్మింపవోయి ప్రభూ! లేకున్న
నిలువ నీడేలేదురా, లోకాన.

ననలు మొనలెత్తు పచ్చిక లేతగొంతులకు
పశువు మునిపండ్ల కర్తనశిక్షతొలగించి
ఆబేల హృదయమ్ము లాత్రపడ కుండునటు
నిర్మింపవోయి ప్రభూ! లేకున్న
నిలువ నీడేలేదురా, లోకాన.

చీరిసింగారించి స్వేచ్ఛ నెగిరెడిజీవి
గాలిలో లీలగా తూలియాడెడి యసువు
సాలియురులను బిగిసి సమసి పోకుండునటు
నిర్మింపవోయి ప్రభూ, లేకున్న
నిలువ నీడేలేదురా, లోకాన

స్వైరమూర్తికి బిభీషికల రంపపుకోత
ప్రేమమూర్తికి మహాభీల జాజ్వల్యాగ్ని
నిష్కల్మషునకు కన్నీటి భోజనపుష్టి
నీసృష్టి చిత్రాలా? నీనవ్వు సత్యాలా?

ఇట్టి విచికిత్సలెన్నియో హృదిజనించి
పుట్టినవి పుట్టినటు లింకిపోవుచుండ
జీవకారుణ్య బాధావిశీర్ణుడగుచు
తన్నుతా విస్మరించు నా ధన్యజీవి.

ఉడుకు గుండియలదుర నిట్టూర్చి యూర్చి
సోలి మూగబాధలతో సుషుప్తి చెంది
తెలివినందుచు శోక విదీర్ణహృదయు
డగుచు తనలోన తా శమమందుచుండు

పరమ విజ్ఞానకాంతి సంపత్తి పొడమ
ఆర్ద్రపు టెడంద కరుణా మయమ్ముగాగ
కలుగుబో అట్టిజీవి కుత్కట దురంత
చిత్తవైకల్య మెపుడనిమిత్తముగనె.

కొడుకు పనిబూని గడియ కన్బడక యున్న
పట్టరాని యుత్కంఠా విభావనముల
కళవళమునంది జనకులగ్గలపు తమిని
కంటపడువర కెట్టెట్టొ గడుపుచుంద్రు.

అట్టు లన్యోన్య మొక్కడే ప్రాణమగుచు
కలసిమెలసి వర్తించెడి కాలమందు
ఫలసమిత్కుశ కుసుమ సంపాదనార్థ
మరిగె వాహనుం డొకనాటి తరుణమందు

పోయియాతడ ట్లపూర్వకాననదృశ్య
ములనుగాంచి మోదమొందుచుండె
దైవశిల్ప నిర్మితములౌ స్వభావ శి
ల్పముల జూడనెవడు వాంఛపడడు?

కుసుమితలతా పరిష్వంగ కోమలములు
బంభర మనోజ్ఞ ఝంకార భాసురములు
ఫలభరవినమ్ర శాఖాగ్ర కలితమూర్తు
లైన తరుషండముల గాంచిహర్షమందు

కఱకువిపిన వీధులయందు తిరుగుచున్న
ఆమహాసుకుమారు పాదాబ్జయుగళి
వాడికసిగందునని వన్యపాదపములు
రాలుబువ్వుల పాన్పు లేర్పరచుచుండె.

అతని పితృభక్తి, సేవాపరాయణత్వ,
మాతనివిరక్తి, సుమకోమలాంత రంగ,
మతనిభూతాను కంపమ్ము, నాత్మమెచ్చి
అలరురేకుల లతలు పూజలను సలుపు.

అతనికీర్తి గీతికల ననంతగతుల
గొంతులెత్తి యాలాపించు కోనలచట
ప్రాలుమాలి దిదృక్షావిలోల దృష్టిఁ
బరుగులెత్తి యాతనిజేర నురకలిడును.

అట్లు దర్శనకౌతుకం బనుభవించు
చాత్మనుప్పొంగు నతనికా ప్రాంతమందు
శ్రుతులకాకలీ నాదసంగతులు పలుకు
వీణగానమ్ము వీనుల విందొనర్చె.

పురుషహస్త సాధనగాదపూర్వసౌకు
మార్య లాలిత్యభావ సమన్వితమ్ము
ఎవ్వరోయీ మహావని నెరుగరాదు
ఎడదకరుగగంగ వీణవాయించువారు.

అనితలచి యాతడొక కొంత యరుగునంత
కనులబడె, కనత్కనకదీప్తిని, వెలుంగు
కరములనుజాపి, తన్ను దగ్గరకుబిలుచు
కైవడినెసంగు దేవతాగారమొకడు.

సకలదేవాది దేవతాస్థానములగు
నాలయములు ప్రదక్షిణార్హమ్ములనుచు
భక్తిభావ వినమ్రుడై వాహనుండు
అరిగెనచటికి ముకుళిత హస్తుడగుచు

దానియనవద్య శిల్పసౌందర్యలక్ష్మి
కబ్బురంపడి యతడు కక్ష్యాంతరములు
దాటియర్హమ్ము లైనకృత్యములు దీర్చి
ధ్యానపరవశుడై యున్నతరుణమందు.

దేవతాగారమెల్ల ప్రతిధ్వనింప
వీణరావమ్ములో మేళవించి యాల
పించు చరమోడ్పుకనుల నుతించుచున్న
జలజలోచన యొకతె సాక్షాత్కరించె

సరసనిలుచుండి సఖులు వింజామరముల
నమ్రులై వీచుచుండ వీణావిభూషి
తాంగియై దేవళమున కాంతాలలామ
అపరభారతియనగ నొప్పారుచుండె.

ఏలొకో యీసుసాధ్వి యీలీలభయద
గహనచారిణియై యొంటిగా మెలంగు?
ఏలొకో తీవ్రయౌవనజ్వాలనీమె
నియమ జలముల నార్పగా నెంచు చుండె?

అలమహారాజ భోగమ్ము లందదగిన
యీమె వైరాగ్యమూనుట కేమికతమొ?
ఏమికోరికతోడ నీయిందువదన
ఈమహాదుర్గ నిట్టులర్చించునదియొ?

చాలదు శిరీషకోమల సౌకుమార్య
మీమెసుకుమార తనుకాంతి కెన్నిచెప్ప
అళికుల వినీల నైగనిగ్యములసంచు
మించుబో యీసువేణి ధమ్మిల్లరుచులు.

ఆమెమోము దమ్మియందున్న యధర సు
ధామరందమును విదాహమెత్తి
గ్రోలవాలియున్న రోలంబయుగళమా
సన్నుతాంగివెడద కన్నులగవ.

ఆహరిద్రావలిప్త ఫాలాంతరమున
తీర్చిదిద్దిన కుంకుమ తిలకమొప్పు
పసిడివెలుగుల పూర్వదిగ్భాగమం, ద
వతరించెడు నరుణ బింబమ్మువోలె.

ఆమె కలకంఠరవమునం దమరిపోయె
నయుత వీణానులాప నాదామృతమ్ము
ఆమె సౌభాగ్యకాంతిలో నవతరించె
కోటికళ్యాణశోభ లొక్కుమ్మడిగను.

సృష్టిలోనున్న సౌందర్యమెల్ల పుణికి
యొక్క చో జేర్పనెట్లుండునో యటంచు
మనసుపడి కనువేదురునను విధాత
యీమెనుసృజించితన నేర్పునెన్నుకొనియె.

వదన కమలాకరమున లావణ్యజలము
పొంగియిమడక వెలికుబ్బిపోయినట్టి
నిటలజలనిర్గమంబునా నెగడియుండె
నందములకంద మామె సీమంతసరణి.

అనుచు మంటపస్తంబంబు నానుకొని, త
దేకదృష్టి నాకాంత నీక్షించుచుండ
ఆమెకనుగవ తెరచి దుర్గాంబ కెరగి
తనమనోగతమ్మును నివేదనమొనర్చె.

జనని! దుర్గమ్మ! నీదువాత్సల్యహృదయ
మెప్పుడీ దీనురాలి కందిత్తువమ్మ?
అన్యమెరుగను నీదుపాదారవింద
నిత్యసేవానుసక్తమౌ నియతి కాని.

ఎదుగు బొదుగునులేని నాయీప్సితమున
కెన్నియేండ్లెన్ని పూండ్లు గతించిపోయె
నీశిలాతత్త్వమున సుఖనిద్రనంది
యుంటివో యేమొ యిది యేటి యునికి జనని.

నాయొనర్చెడి సేవ కేనాటికైన
తరుగు విరుగున్నదమ్మ నాతల్లికాన?
కరముసాచితి పతిభిక్షకై కడంగి
గరళభిక్ష నొసంగెదే కన్నతల్లి.

జనకులనుబాసి విపినవాసమున నీదు
దాసదాసాను దాసినై తనరినాను
నియమనిష్ఠల నుపవాస నిరతిదగిలి
రక్తనైవేద్య మిడితినే రాజ్ఞినీకు.

నావినిర్మల భక్తి నెన్నాళ్లునీదు
పాదసన్నిధిని నివాళి పట్టినాను?
పండుననుకొన్న యాశలే యెండిపోయె
ఇంతటి కృపాదరిద్రవై తేలనమ్మ?

ఎన్ని చేసిననీకు సుంతేనికరుణ
కలుగనేలేదు నాపూర్వకర్మమేమొ?
చాలుసఖి! నిత్యశుష్క పూజాసపర్య
లేల పాషాణియిది పల్కునేకరంగి?

అని తిరస్కారభావ విన్యాసమమర
రోష బాష్పావరుద్ధ నేత్రోత్పలముల
శూన్యదృక్కుల బరపి వాక్శూరయగుచు
సఖులతో గూడి పోబోవు సమయమందు

ఆదిశక్తి మూర్తి యందుడి దరహాస
గర్భితములు, ప్రేమకలితములును,
నిశ్చయాత్మికములు నినదించె నొకకొన్ని
పలుకు లద్భుతార్థ భాసురములు.

మలయవతి! యేటికమ్మ యిట్లలుక చెంది
పరమ నిందానులాపముల్ పలుకుచుంటి
కలిసిరాకున్న యోగసంకల్ప బలము
దేవుడైనను నీకోర్కె తీర్పగలడె?

శమదమాభ్యాస నిష్ణాతుశక్తులగుచు
అద్భుత తితిక్షతోడ నత్యంతభక్తి
నవిచలిత మతులై తపమాచరించి
సిద్ధినందిరి యెందఱో సిద్ధమునులు.

అంతియేగాని కష్టసాధ్యంబులైన
దైవసిద్ధులకిట్లు తంద్రాళులగుచు
హృదయ దౌర్బల్యమును ప్రకటించినారె?
నీవలె, వచింపవమ్మ యో నీరజాక్షి.

ఎట్టివేళ కేజీవికెట్టెట్టి కర్మ
మనుభవించెడి పంతు నియామకంబొ
ఆవినిర్ణయమును దాట నలవియగునె
దైవము నిమిత్తమాత్రమే తల్లికాన.

యోగపురుషకార యుక్తి యె దైవమ్ము
సంఘబలమె దానిశక్తి యగును,
సాహసానుగామి సంకల్పదీక్ష బీ
జ మ్మదృష్టఫలమె సహజసిద్ధి.

అట్టిదైవతత్వ మరయక నిందింప
బూనుకొంటి విద్దిబోలునమ్మ?
పూర్ణభక్తినీదు పూజానురక్తి యు
చాలనాకు సంతసంబుగూర్చె.

నీమనోరథమ్ము నెరవేరు సుముహూర్త
మిపుడెవచ్చె నింతయేల నబల?
అనుచు నాదరమున హస్తసంజ్ఞలను వా
హనుని జేర బిలిచి యనియెనిట్లు.

మలయవతి! దయాసత్య నిస్తులయశోవి
రాజితుండైన రాజాధిరాజితండు
వానినామము జీమూతవాహనుండు
అల్ల జీమూతకేతున కాత్మజుండు.

వాహనా! యీమె యావిశ్వవసు సుపుత్రి
సకల శుభలక్షణోపేత సాధుశీల
మలయవతి నామమిప్పుడీ మానినికిని
నీకును వివాహఘటన నిర్ణీతమయ్యె.

ఇపుడు ఘటనాబలమ్ము మిమ్మిడ్చి తెచ్చి
నానెపమ్మున మిముగూర్చినది వినుండు
ఈప్సితా వాప్తినంది మీరింకమీద
పుణ్యజాయాపతిత్వము పొందుడనిన

అంత నుభయులామె కంజలించుచు దండ
వత్ప్రణామమిడి సభక్తికముగ
జనని! నీదువిధిని శాసనంబుగ, తల
దాల్తుమనుచు పలికి తరలిరపుడు.

ఇట్లు దైవయోగమే ప్రేరకంబుగ
పితృ మనోవ్యథంబు ప్రిదిలిపోవ
వాహనుండు తావివాహితుడై, సప
త్నీకముగను సేవనెఱపుచుండె.

ఆమెలోని నిష్కాపట్యమైనభక్తి
సత్యపరిపూత పూర్ణవాత్సల్యగరిమ
కెరడుకట్టినరీతి నాపరమసాధ్వి
అత్తమామలకు సపర్యలాచరించు.

మాటలను చేతలను నిసుమంత భేద
భావమెరుగక మిగుల నాప్యాయముగను
ఇష్టమృష్టాన్న భోజ్యంబు లిడుచువారి
పంచప్రాణములటు దయాపాత్రయయ్యె.

ఆమె పూసలలో దారమట్లుమెలగి
అందరకు తలలో నాల్కయనగ నుండె,
ఎంతటి యదృష్టమో కోడలిట్టు లత్త
మామలం దనుకూలమై మసలు టరయ.



# ఆత్మసమర్పణము

అదికదా ధన్యమెవని గృహాంతరమున
దుఃఖమయము, బాధాతమస్తోమబంధు
రమ్ము, భేదాత్మతా దుర్భరమ్మునైన
సంసృతి ప్రశాంతవృత్తిమై జరుగుచుండు;

అదికదా ధన్యమెవని గృహమ్మునందు
కపటమేలేని ప్రేమ, నిష్కల్మషంపు
చిత్తవృత్తియు, గౌరవశ్రీయు, పెనగి
ఆకుటుంబ గజాంకుశమై చరించు;

అదికదా ధన్య మేగృహప్రాంగణమ్ము
పరమవాత్సల్య జలపూర భాజనమయి
వృద్ధకులగురు సేవా సమృద్ధమగుచు
సంతతానంద మయముగా సాగుచుండు.

అదికదా ధన్య మేగృహాభ్యంతరమ్ము
పూజ్య పూజావ్యతిక్రమంబులకు తొలగి
కుత్సితస్వార్థపరతత్వ కుటిలగామి
గాక పితృవృద్ధ సేవగ్రగణ్య మగునొ.

పుణ్యకులవృద్ధు లెట మనఃపూర్వకముగ
పుత్రపౌత్రులు వెయ్యేళ్ల మొదలుగాగ
అనవరతము నాశీర్వచనాక్షతలను
తలలజల్లుదు రదికదా ధన్యగృహము.

ఒక్కకంట బెల్లమును వేరొక్కకంట
సున్నమన్నట్లు కొడుకుల జూడకెచట
గురుజనులు సమదృష్టిని గూడియుందు
రదిగదా ధన్యతమమైన యవసథమ్ము.

ప్రకృత మారీతి సంసారబంధములకు
చిక్కియున్నను వృద్ధసంసేవ కతన
వాహనుండాత్మ జీవితావధిని వనుల
కడగి యానందమయముగా గడుపుచుండె.

అట్లుగడుపుచు నొక్కనా డామహోగ్ర
గహనసంచారియై తిరుగాడుచుండ
అంతమేలేని, చూచుటకలవిగాని,
యెముకగుట్ట లాతనిదృష్టి కెదురుపడెను.

బాపురేయిట్టి కంకాళ పర్వతమ్ము
లేర్పడుట కెన్నిజీవమ్ము లీల్గినవియొ?
పాడుపడియున్న వివిధాస్థి పంజరమ్ము
లిందుకననగు తాత్వాంశమేమి యగునొ?

ఏమహాక్రూర సత్వప్రవృత్తి యిచట
అమితహింసా కళంకిత మైనయదియొ?
కాక యేరాతిగుండెల కఠినుబ్రదుకు
కలుష దారుణముల కొడికట్టినదియొ?

బ్రదుకదలచిన నిండు జీవమ్ములెన్ని
మరణవేదనలంది దుర్భరవిషాద
గద్గ దాంగకమ్ముల కాలగర్భమందు
శల్యశేషమ్ములై మూల్గి చచ్చినవియొ?

చనినజీవుల వాంఛా ప్రసక్తులెన్ని
యిచటగాలిలో ధూళిలో నేకమయెనొ?
ఆశలడుగంట శూన్య దృగంచలముల
బరపియెన్ని ప్రాణములిట భంగపడెనొ?

ఇటనిసర్గ సర్గపుటంద మెంతసమసి
బూడిదనుబోయు పన్నీటి పొలుపుకనెనొ?
రూపురేకలు నూరుపేరులు మఱెన్ని
దాగిపోయెనొ మరణబంధముల తెరల

ఎన్నియాత్మలు సురిగి పోయినవొగాని
ప్రోగువడిన యీయెమ్ములు పుణికలిచట
సుఖచిరంతన మరణ సుషుప్తి మునిగి
జీవితాంత రహస్యముల్ చెప్పికొనును.

ఎన్నియెన్ని కుటుంబమ్ము లీదురంత
సంఘమరణమ్ము తలచి విచారకీలిఁ
గుమిలి నిర్ధూమధామమై కూలినవియొ?
ఎవ్వరెరుగుదు రేనాటికేది గతియొ?

అనుచు శోకాకులిత చిత్తుడై కరమ్ము
దైన్యభావము ముఖమందు తాండవింప
ఆవిశీర్ణ శల్యమ్ముల నశ్రువులను
కడుగుచు తదేకదృష్టిని గాంచుచుండ

అక్కటా! గర్భశత్రువు కైనగాని
వలదువలదురా యీదురవస్థ తండ్రి
పుట్టె వంశాంకురంబని పొంగిపోతి
గాని తుదకిట్టులగునంచు కానవైతి.

ఒక్కగా కొక్కబిడ్డవైయుండ, మనదు
పాలికిటు దాపురించె పాపంపుగరుడి
యేమిచేయుదు దిక్కెవ్వరీ కఠోర
కానన దయాదరిద్ర మృగప్రవితతి.

ఆర్తసంత్రాణ పరులులేరా? మహాత్మ్మ
లస్తమించిరా? ఆపదకడ్డుపడర?
దిక్కుమాలిన యీ దురదృష్టవంతు
రాలి మొఱనాలకింపరా? జాలికనర?

అక్కటా; నిన్నుకనుగొన్న దాదిపెంచి
పెద్దవానినిగాజేసి పెండ్లిచేసి
తుదకు మాచేతులార నీ దుర్దినమున
అర్పణము చేయుటా గరుడాశనముగ?

తొంబదేడుల తొక్కునై తుదకునీదు
చావుకనుచుంటి నిట్టినీచాతినీచ
మైన నాబద్రుకేల నేనైనచచ్చి
నిన్ను బ్రతికించుకోరాదె కన్నతండ్రి!

కన్నకడుపొటచే నింతగాతపించి
పొంగిపొరలెడి శోకాన పొక్కుచుంటి
పోవతప్పనిసరి వెన్కముందుగాని
నాకు చావురాకున్నదిరా కుమార!

ఈ కుణపదేహ మెన్నటికేని యసువు
బాసి నశియింపదా? మేముబ్రతికియుండి
మాకనులముందు పుట్టిమీర్ మరణమందు
టా? యిదేమి ప్రారబ్ధమ్ముర్రా కుమారా!

దైవమా! నాయరణ్య రోదనమువినిన
జాలియెవ్వరికీ పరిసరములందు
పూనిపెండ్లిండ్ల సందడిమున్గియున్న
నేడ్చువానిని జూచువారెవ్వరింక?

ఇట్లు కంటికి మంటికి నేకధార
గాగ విలపించి యేడ్చుచు కన్నసుతుని
అనుగమించుచు నాగవృద్ధాంగ నోర్తు
వాహనుండున్న చోటికి వచ్చినిలిచె.

నిలిచియున్న వృద్ధసువాసినిం గనుగొని
పలికెనాతడు భక్తిప్రపత్తులొలుక
తల్లి! యెవ్వతివీవు? రోదనమదేల?
మీకు కలిగిన కష్టమేమే మదంబ?

**నాగవృద్ధ**

ఆర్చెదవ తీర్చెదవ? యేలనయ్యనీకు
యేడ్చుచుండ మఱింత యేడ్పింపతలతె?
చెప్పవా; యీశ్మశాన మస్తిష్కమాంస
రుధిర కంకాళ శల్య శిరోరుహములు.

వాయసంబులు గ్రుధ్రగోమాయువితతి
రామబందుల కోలాహలమ్ము కనవె?
ఎడతెగపాఱు నీనెత్రుటేర్లు తత్వ
మవగతము సేయవేమి? నన్నడుగనేల?

**వాహనుడు**

అమ్మ నీ ప్రాణములకు నాప్రాణమడ్డు
భయములేదేమి వచ్చె నుత్పాతమిపుడు?
తెలియచెప్పిన కొంతైన దీర్పగలగు
దడుగకున్నను పెట్టునే యమ్మయయిన?

అవనిలో పరస్పర సహాయంబులేక
పతికిసతిలేదు తండ్రికి సుతుడులేడు
ప్రణయమే లేదు స్నేహభావంబె చెడును
లోకయాత్రా క్రమంబె విలుప్తమగును.

**నాగవృద్ధ**

నాయనా! నోరురాకున్న దోయితండ్రి,
పిడుగుపడినట్టులయ్యెనే విధి వచింతు,
పాపపంకిలమైన ప్రపంచమెల్ల
దుఃఖభూయిష్టమై నేడు తోచుచెండె.

ధర్మము కృశించె న్యాయవాదమ్ము సడలె
హెచ్చె దుర్మార్గమిపుడు నిర్హేతుకముగ
పేదసాదల ప్రభువులు పీకిచంపి
తినెడికాలము వచ్చె నేమనగనేర్తు?

గరుడు డనువాడు విదితవిక్రము డొకండు
గలడుమాపాలి కతడొక కాలయముడు,
అహికులంబెల్ల నాతని కశనమగుచు
దినదినముపోవ రాజశాసనముగలదు.

ఆర్చియీయండ పిండ బ్రహ్మాండమెల్ల
ఒక్కకబళమ్ముగా మ్రింగనోపునతడు
పక్షవిక్షేప ఝంఝూ ప్రభంజనమున
చెలగి ముల్లోకముల నెగజిమ్మగలడు.

పాదఘాతలచే కులపర్వతముల
కందుకక్రీడ నాడింపగల డతండు,
సప్తజలధుల జలమొక్కసారిగాగ
నతడుపట్టెడి దిట్ట యాపోశనముగ

వజ్రదుర్భేద్య మాపక్షివరుని త్రోటి
ఉక్కుకొండల పిండిగా నొక్కవలతి,
పెక్కులేల ఆతని రోమమొక్కటైన
కదుపలేడయ్యె హరివంటి ఘనుడుకూడ

అతడు పెల్లార్చి నాగలోకాగ్రహార
భవనములపయి వ్రాలు నార్భాటమునకు
భిన్నగర్భమ్ము లండవిచ్ఛిన్నములయి
అదరిపడి చచ్చుచుండె మా యహికులంబు

నాటినుండియు నొక్కొక్క నాగమతని
హారమగుచునుబోవ నాచారమయ్యె,
నేటికా పిట్టపిడుగు నానెత్తిని బడి
కొంపత్రవ్వెన దేమనుకొందు కొడుక!

రాజునాజ్ఞ దాట రానిదై వేధించు
నేకపుత్ర విషయ మేమి యందు?
ముందుకేగ నుయ్యి పొరి వెన్కకునుబోవ
గొయ్యి నాయవస్థ యయ్యెనయ్య!

నాగరాజీ వ్యవస్థ నిర్ణయముచేయ
గరుడు డశనము గొన్న నాగములయెమ్ము
లిట్లు వింధ్యాద్రి పోలికనెదుగుచుండె
పదరి యీపాపమెప్పుడు బ్రద్దలగునొ?

అనుచు రోరుద్యమాన ఖిన్నాంగి యగుచు
కొడుకుపైబడి యేడ్చెను కురరివోలె,
రంపమున చీల్చివేయ, వజ్రమున తఱుగ
ఉడిగిపోవునే ఆకన్న కడుపుతీపి?

ఆమెకనులు వర్షాభ్రమ్ములగుచు, నశ్రు
వృష్టికురియగ వాహను హృదయసీమ
విమలకరుణా రసార్ద్రమై వెల్లివిరిసె
సరసులమనంబు రస వినిష్యందియగుట

**వాహనుడు**

కటకటా; యెంతదారుణకార్యమితడు
నదురుబెదురును లేక పొనర్చుచుండె;
కాయకసరలు తిననిండు మాయపొట్ట
కెన్నిజీవుల హింసించె పన్నగారి;

కష్టదశనున్న యీమెవైక్లబ్య మరయ
గుండెలో నండలండలు కూలునాకు,
ఇనుపశిలలును కరిగి ద్రవించుచుండ
గరుడుని యెడంద యొక్కటే కరుగదేమొ?

నాదుజన్మ సార్ధకమయ్యె నాదుపూజ
లిప్పుడు ఫలించె నాదేహ మిచ్చియైన
అహి కుమారునిగాచి యీయమ్మదుఃఖ
మపనయించి తరింతు ధన్యతను గొనుచు.

అమ్మ! దుఃఖింపకమ్మ పుణ్యాత్మురాల!
నీసుతుండు చిరంజీవియై సుఖించు
ఆ ఖగేశ్వరు భుక్తికై యాత్మదేహ
మర్పణముసేతు నిస్సంశయమ్ముమాత!

జనని! ఆసన్నమరణ విచారఖిన్ను
డైన సుతుతోడ నీయింటికరుగుమమ్మ,
బలికిబిడ్డనొసంగి యాబడుగుతండ్రి
యెంతకుములుచు నుండెనో యింటనొకడు.

**నాగవృద్ధ**

నాతనయు డెట్లొనాకు, నీతల్లికీవు
నట్టులేగాదె? యెంతమాటాడితయ్య?
గర్భవాసము వేయిపగ్గములబట్టి
తిగిచిలాగిన దానికి తిరుగుకలదె?

అడిగితివిగాన చెప్పితి నంతెగాని
యెవరికర్మ కెవ్వరుకర్త లెవరుభోక్త
లెవ్వరడ్డెడివారు తండ్రీ! నిజమ్ము
కర్మకనుభవమే క్షయకారణమ్ము.

ఎందుకును లేదుగాని జీవించియుండి
త్రోటిపోటులజీల్ప మొఱ్ఱోయటంచు
కొట్టుకొనుచుండ ప్రాణినిపట్టిపీకు
పన్నగారి నిర్దయితకై పరితపింతు

**వాహనుడు**

అమ్మ జీవిత తత్వరహస్యమందె
విధియిమిడ్చెను నిర్దయాబీజమొండు,
దానివికృతియె హింసావిధానమయ్యె
తప్పలేదది పంచభూతమ్ములకును.

బాలపాప లజ్ఞానభావమునతాక
కాల్చిబాధించు వహ్నికి కరుణగలదె?
కాలుజారి ప్రమాదాన తూల ముంచి
జనులచంపెడి నీటికెచ్చటిది కరుణ?

**శంఖచూడుడు**

ఇదిప్రపంచమ్ము జనని! యిందెచటకనిన
ఆర్తరక్షణలేదు, దయాదరిద్ర
రుద్రభూమియ్యది, దరిద్రరోదనములె
గగ్భనిర్భేదక మొనర్చు కన్నతల్లి.

ఓదయామయ! నీ కేలనీ దురంత
దుఃఖభార మ్మనుభవింప తొలగుమయ్య,
కరుణగలదేని నాయనంతరమునందు
అమ్మజీవించెడి యుపాయ మరయుమయ్య.

ముక్కిమూల్గెడి గతిలేని ముదుసళులకు
ముప్పునకు దాపురించె నీతిప్పలెల్ల,
జనకులకు దుఃఖముంగూర్చు చెనటికొడుకు,
ఉన్ననొక్కటె యూడిన నొకటిగాదె;

**వాహనుడు**

నాయనా! శంఖచూడ! అన్నావుమాట
అమ్మజీవించెడి యుపాయ మరయుమనుచు
నీవుబ్రతికిన బ్రతుకును నీదుజనని
కాన నీ వీప్రయత్నము మానుమయ్య.

అనుచు నిరువుర వారించి కొనుచు ధృతిని
వధ్యశిలనెక్కె నవ్వుచు వాహనుండు,
అతని నిస్పృహోత్సాహంబు లతనిత్యాగ
మా దయావీరము వచింప నలవియగునె?

**శంఖచూడుడు**

హో దయామయ! హో కరుణాలవాల!
స్వామి! నిర్హేతుకార్తవత్సల! కృపాళు!
దిగుము దిగుమయ్య; యీయప్రతిష్ఠనాకు
నెత్తిగట్టకుమయ్య, మన్నింపవయ్య

పరమపాపిష్ఠ తుచ్ఛజీవనమొకండు
నిలుపుకొనుటకు నీవంటి నిర్మలాత్ము
ప్రాణములు లంచమిడి నేనుబ్రదుకుటన్న
నింతకన్న శిరచ్ఛేద మేమిగలదు?

ఆర్తసంత్రాణ మొనరింప నవనియందు
బ్రదికియున్నను చాలు నీవంటిసుకృతి
చావబ్రదికిన మావంటి స్వార్థపరులు
వ్యర్థజన్మలు భూమికి బరువుచేటు.

**నాగవృద్ధ**

కన్నకొడుకు వంతుకై యన్యమాతృగ
ర్భమును కాల్చినేను బ్రతికియిట్లు
మాతృకుల విశిష్ట మర్యాదలకు కళం
కము ఘటించి తిరుగగలనె తండ్రి!

కాలమంతయు తీరె రోగములుపట్టి
పీల్చి పిప్పియొనర్చె నోపికయుచచ్చె
బ్రతికిమేముండి చేయు నిర్వాకమేమి?
వలదు వలదయ్యయో మహాభాగ! వలదు.

అనుచు నుభయులతని హస్త ద్వయమువట్టి
లేపదలపగా చలింపడయ్యె
త్రిప్పనెవరితరము ధీరులహృదయము
చకితమై ప్రపంచ చలనమైన

అంత తీండ్రించుచు మహాట్టహాసరవము
గమనవేగంపు రొదతోడ కలసిమ్రోయ
నెగిరివచ్చెడి కులగిరియే యనంగ
వచ్చివాలె చివాలున పన్నగారి.

వాలిరుసరుసల్ నిగుడ నవ్వారినెల్ల
నదరు లుమినెడికనుగ్రుడ్ల బెదరజూచి
ఏమిరా! కండకావరమెక్కి మీర
లింత యాలస్యమును చేయుటేలకలిగె?

వేళపాళలులేక యీవిధినినాదు
క్షుత్తు పెడరేపిరేని చూచుకొనుడింక;
మరచిరే యింతలోనె? యన్మత్ర్పతాప
దహన దందహ్యమానాహి దశలనెల్ల.

అనుచుగద్దింప నతనిదర్శనమునకె వి
శీర్ణమౌవారి యసువులు చెల్లచెదరె,
శాంత నిష్పందదృష్టి, నైశ్చల్యమొప్ప
ననియె స్మితపూర్వభాషి వాహనుడొకండె.

**వాహనుడు**

ఓమహాసత్వ! శాంతింపుమో మహాత్మ!
ఆగ్రహింపకు మాలస్య మయ్యెనయ్య,
సిద్ధముగనుంటి యీవధ్యశిలనుజేరి
త్వరగభక్షించి నీక్షుత్తు వాపికొనుము.

అని నిమీలితపక్ష్ముడై యాతడుండ
విషయమంతయు తృటిలోన విన్నవించి
తన్నుతినుమని కోరుచు కన్నసుతుని
వీడుమనివేడె గరుడ నావృద్ధమాత.

**గరుడుడు**

లేదిక వయఃపిశాచ లేలిహ్యమాన
మై, త్వగస్థి శేషమ్మయినట్టినీదు
జీర్ణ దేహమునందు రుచించు పలల
మవ్వ! డబ్బెత్తు, నాకెట్టు లాకలణగు.

**శంఖచూడుడు**

కన్నుకాలును కానని కన్నతండ్రి
కమ్మమరణింప దిక్కు లేదయ్యబాబు;
దయను నాకోర్కె చెల్లించి తల్లివిడిచి
తినుము నా దేహమును వైనతేయయిపుడు.

**వాహనుడు**

ఒక్కసుతు డీతడీల్గిన నుభయులిపుడు
లుప్తపిండోదక క్రియాతప్తులగుదు
రీమెపోయిన ముసలి కృశించిచచ్చు
కనుకవారల వీడి నన్తిను సుపర్ణ!

అనుచు నర్థింపు నాపల్కులాదరించి
పట్టరాని యాకలి చిచ్చు బాధవెట్ట
తినుట మొదలిడె వాహనుదివ్యదేహ
మెల్ల గంటులువడి నెత్రు పెల్లుదొరగ.

కౄరచంచూపుటోగ్ర నికృత్తమగుచు
స్రవదసృక్ స్నాతభయద సర్వాంగమగుచు
శీర్ణమాంస బీభత్స సంశిధిలమైన
వాహనుని దేహమపుడు రూపంబెమారె.

నలిగి యెడనెడ దేహబంధములు సడలి
ఆతని శరీరమెల్ల శల్యావశిష్ట
మయ్యె, నట్లయ్యును చలింపడా మహాత్ము
డించుకయి బాధయనడు ఖేదిల్లడహహ.

**గరుడుడు**

ఎవ్వడో యీమహామహు డెంతనొంచి
పొడిచి కండకండలుపీకి ప్రోగులిడిన
కిక్కురనడు రవంతయు కినుకగనడు
సహనసంపన్నుడీ భాగ్యశాలియెవడొ?

అనుచు తినుటను విరమించి యచటనొక్క
గండశిలపయిజేరి యాగరుడు డపుడు
రెక్కలను ముక్కుతో సవరించుకొంచు
నిర్మిమీలిత నేత్రుడై నిలిచియుండె.

అట్లునిలిచిన నతనివాహనుడు గాంచి
పలికెనీరీతి గుండెలు పగులునట్లు,
ఏమిస్వామీ! రుచింపలేదా? మదీయ
దేహపలలము తృప్తిగా దినరదేల?

రక్త మిదెనాదు దేహనాళములనుండి
యింకను స్రవించుచుండె, శేషించియుండె
మాంస లేశముల్, భక్షణ మానిమీర
లిట్లు తాటస్థ్యమును బొందనేలనయ్య!

మీదువైఖరి కనిన స్వామీ! రవంత
తృప్తి వడినట్లుగా తోపదే కృపాళు!
నిండనేలేదు మీకుక్షి నీరసంబు
తీరనేలేదు, తినక వర్తింపనేల?

అచ్చుటచ్చుట యెమ్ముల నంటియున్న
దిదిగో యీమాంసమెంతో రుచించుమీకు
ఇచటచిక్కని యెఱ్ఱ స్రవించుచుండె
జుఱ్ఱుకొనుమయ్య, దప్పి తీర్చు కొనుమయ్య.

ఇట్లు చేసాపి మాంసమందిచ్చు చుండి
యనునయించెడి వాహనునరసి, యాల
గోలు బాలగోలును బెట్టికొనుచు నచటి
నాగులేడ్చిరి కడుపు సంద్రమ్ముగాగ.

**వాహనుడు**

అమ్మ! యేడ్చుచుపెట్టు దానమ్ము వలన
ఫలితమేలేదు, మనము సంబరముతోడ
నిడినతృణమైన నయ్యది యిహపరముల
సద్గతికి కారణమ్ము విచారమేల?

తల్లి! యీనాటి సత్పాత్ర దానమునకు
నాత్మదేహము వినియుక్తమైన కతన
నేకృతార్థుడనైతి తరించి తింక
నే నభిలషింప వలసిన దేమిలేదు.

అనుచుప్రాణముల్ కడముట్ట కనులుమూసి
తైలశూన్య దీపికవోలె తనువుక్రుంగ
కునికిపోయెను, మరణ రోదనములంత
కంతకును హెచ్చె కానన మదరిపోవ.

అప్పుడీ ఘోరవార్త వనాంతమందు
ప్రాకియానోట నానోట పరుగులెత్తి
యవల జీమూతకేతుని చెవులబడియె
పెదవిదాటిన పృథివి దాటదె యెదైన.

వినుడు, మూలంబు నరికిన వృక్షమట్లు
విరిగికూలెను గుండె గుభెల్లుమనగ
ప్రాంత వృక్షకములరీతి పడిరిధరను
అత్తకోడండ్రు దుఃఖ నిహన్యలగుచు.

వేయినోళ్ల వచింపగా వెలితిపడెడి
వారిదుఃఖము చెప్ప నెవ్వరితరంబు?
కోటికన్నుల వీక్షింప కొఱతవడెడి
వారి దుస్థితుల్ సూడనెవ్వరికి వశము?

అట్లు దుఃఖించి దుఃఖించి యామహెూగ్ర
కాననమున పుత్రకుడున్న కడకుబోయి
యేడ్చిరాకట్టె పైబడి, యెదచలించి
చూచువారల గుండెలు చూర్ణమవగ.

**జీమూతకేతుడు**

ఓమహాత్ములార! యోసిద్ధ సాధ్యులా
రా! మదేకపుత్రుడైన నితని
బాసి నిలువలేము బ్రతికించి మాకిక
పుత్రదాన మిచ్చి బ్రోవరారె?

ఐనదైనది యోమహాత్మా! సుపర్ణ !
పుత్రభిక్ష నొసంగుమో పుణ్య చరిత
బ్రోవతలచిన పదునాల్గు భువనములను
నీకుతిరుగున్నదే కృపా నిరతహృదయ!

నాడునాగుల కమృతదానమ్ముసేసి
వారిప్రార్థన చెల్లింపవా? మహాత్మ!
అట్లె యేయుపాయమ్మున నైనసుతుని
జీవితములిచ్చి మమ్ము రక్షింపలేవె?

పనవి యేడ్చుచు ముప్వురీపగిది గరుడు
పాదములకడ సాష్టాంగపడిన నతడు
అమృతమని నంతనే స్మృతి నభినయించి
తనదు దుర్నయవృత్తి కెంతయును గుందె.

వాయువేగ మనోవేగ వర్తనముల
వెడలి యమృతముతెచ్చి వేవేగమతని
కరుణతోడుత బ్రతికించె, కన్నవారి
కనులపండువుగాక నా గరుడు డపుడు

అప్పుడచ్చటి వారలంతంత బొంగి
కనుల నానందబాష్పముల్ క్రమ్ముకొనగ
గరుడుఁ బొగడిరి వారిదుఃఖములు మరచి
చచ్చిబ్రదికిన నట్లుంట సహజమెకద;

అట్లుబ్రతికిన వాహను నధికభక్తి
గెరలివారెల్ల బిగ్గకౌగిళులజేర్చి
బ్రతికితిమి నీకతమునసో భద్రమూర్తి
యనుచు కొండంత సంతసమంది చనిరి.

నాటినుండియు గరుడుడన్యాయవృత్తి
సర్ప భక్షణమునుమాని చచ్చిపడిన
భుజగ కంకాళముల పెనుబ్రోవులందు
నమృతముం జిల్కిబ్రదికించె నధికకృపను.

అంతపీనుగు పెంటలైనట్టియా మ
హాశ్మశానము భుజగవిహారభూమి
యగుచు నలలను చెలరేగు నర్ణవంబు
పోల్కినచ్చటి జనుల కబ్బురము గొల్పె.

అమృత సేచనమున నమృతత్వమందిన
వాహనుండు భక్తి భరితుడగుచు
పితృపదాబ్జములకు నతులొనర్చి విహంగ
పతినిజూచి యిట్లు పలికెనపుడు.

అతులసత్పాత్ర దానధన్యత్వమంది
పరహితమ్మున కైతినన్ భ్రాంతిపడితి
పితృ హితమ్మునకై ప్రాణభిక్షపెట్టి
తిరిగినన్నిటు బ్రతికించితే మహాత్మ!

నాకిడిన యీపునర్జీవ నమ్ముకంటె
భుజగకులమును బ్రదికించి పొందినట్టి
మీదుసత్కీర్తి యీభూమిమీద నిలిచి
యుగయుగమ్ములమార్ మ్రోగకున్నెసామి.

అనుచు నుతిసేసి యా విహంగాధినాదు
సెలవుగైకొని పితృసతీ కలితుడగుచు
చుట్టములు పక్కములు తన్నుచూచి మెచ్చ
నాశ్రమముజేరి సుఖలీల నలరెనంత.

# ఉప సంహృతి

ఏనాటిగాథయో యీనాటికిని, జగ
జ్జేగీయమానమై చెలఁగుచుండె
ఏనాటివ్యక్తియో యీనాటికిని, జగ
ద్దేదీప్యమానమై తిరుగుచుండె

ఏనాటిబోధయో యీనాటికిని, జగ
త్తోస్తూయమానమై తూగుచుండె
ఏనాటికీర్తియో యీనాటికిని, జగ
త్తంతన్యమానమై తనుపుచుండె

నేటికేనాటి దెన్న నెన్నెన్ని యుగము
లచలమై స్థాణువైనిల్చె నవనినహహా,
హేతువింతకు పితృభక్తి యే యటంచు
ఢంకపై దెబ్బకొట్టి చాటంగవలదె?

పితృగౌరవమునిల్ప నతులరాజ్యమువీడి
శ్రీరాము డడవుల చేరలేదె?
పితృ హితంబొనరింప భీష్ముడు తనజీవి
తాంతమ్ము బ్రహ్మచర్యమును గొనడె?

జనకాజ్ఞ తలదాల్చి జామదగ్ని స్వమాతృ
జీవితమ్ముల నిల్పి కావలేదె?
జనకువాంఛల దీర్ప తనయౌవనమొసంగి
పూరుడు ముదిదశ పొందలేదె?

పావన విశాల భరత భూఫలకమందు
వారిచరితల సౌవర్ణ వర్ణవితతి
వజ్రసార సంఘటితమై వరలుచుండె
తారకాపూర్ణమౌ వియత్తలమువోలె.

రమ్యతరమైన భారతార్ణవమునందు
అట్టిమాణిక్యములపంట యంతరించె
పండుచున్నది నేటి కేపాపఫలమొ
స్వచ్ఛదుష్పుత్ర కాణకాచములపైరు.

పెత్తనములందు బేధముల్ పెట్టి
అప్పుకో లేక యాస్థికో వృద్ధగురుల
విడిచి వేధించు కుమతికొమరులు నేడు
కలిగియున్నారు తల్లుల కడుపుచేటు

# దుర్గాశతి

ఓం
జనని ఓంకార దివ్య పంజరపు జిలుక !
ఉపనిషత్కేలివనముల నుండు పికమ !
ఆగమపుటడవులకేరునట్టి నెమ్మి !
గౌరి! నిను లోక మాతగా గణన సేతు. 1

దయను చిలికెడి సోఁగ కన్దంట దాన !
అభ్యుదయ మార్గమందిచ్చు నభయ వరద !
వామకుచమాను వీణెతో వరలు దాన !
సరస సంగీత మాతృకా! జయము జనని ! 2

పంచ ముఖముల తోడ దీపించు తల్లి!
ఉంగరపు ముంగురుల ముద్దులొలుకు తల్లి !
కుటిల చిత్తుల శిక్షింప గోరు తల్లి!
పద్మవాసిని! శ్యామలా ! వందనములు 3

కులుకు రాయంచనడల రాజిలెడి తల్లి !
చంద్ర శేఖరు రాణిగా జరుగు తల్లి !
తీయ తీయని పలుకులఁ దివురు తల్లి !
కలమతంగ సత్కుల కన్యకామతల్లి ! 4

మొగ్గపల్ చాలు సొగసు మోమునకు గూర్ప
కుంకుమపుబూత నొసలున గుబురుకొనగ
నీలమణి కాంతి యొడలు వన్నెలు తొలంక
సర్వ లోకైక రాజ్ఞి! నిన్ సన్నుతింతు 5

తల్లి ! మాతంగి ! సిద్ధమాతంగి వీవు
మణి శకలమేచకాంగివి మాత నీవు
యౌవనవిహార విపిన సారంగివీవు
గాన పద్మానుభూతి భృంగమవు నీవు. 6

యోగి మనసులలో నిత్యముండుదాన !
వేదభాషితముల లోన వెలయు దాన !
గీతవిద్యా వినోదాల కేరుదాన !
అష్ట భైరవ వేష్టితా ! అంబ! నతులు. 7

రిక్కలను ధిక్కని తిరస్కరించునట్టి
నవ్య వజ్ర నాసాభరణమ్ము దాన !
గాన తాళగతుల జూపగఁల్గునట్టి
కనక మణి కంకణములతో గ్రాలుదాన ! 8

కచ్ఛపీనాద సంగమై, కమలవదన
మాధురీ భృంగమై, ఘృణామహిత రంగ
మై, సమస్తభక్తాకర్షి, యైనయట్టి
అమల భవదపాంగమ్ము నే నర్థిదలతు. 9

అంబ ! అజ్ఞాన, కర్మ, గాడాంధకార
దిగ్ధజనులకు జ్ఞానైకదీపమీవు
అమృతవార్ధి మణిద్వీపమందుగల్గు
దివ్య కాదంబ వనసుస్థ దేవి వీవు. 10

శ్యామలాంగమ్ము సౌకుమార్యమ్ము చిమ్మ,
నిశ్చలానంద మొలుకునున్మేష మొప్ప
ఆర్ద్రతతొలంకు కల్లోలమైన చూపు
నీదు తరుణిమ కరుణావినిద్రమంబ ! 11

స్వరసమైన వీణా రవాస్వాదనమున
ఒడలెఱుంగనియానందముప్పతిల్ల
రవలతాటంక రుచులు పర్వంగ నీదు
స్నిగ్ధహసితముగలమోము నే స్మరింతు. 12

సరిగమపదని సుస్వరస్థానములుగ
నిరతి వీణను బలికించు కరములొప్ప
శాంత మతిమృదుస్వాంత ముపాంతకాంత
కచభరాక్రాంత మాయు మా కాంత గొలుతు 13

శిరము కంపింపవీణియఁ జిత్రలీల
మీఁటుఁచుండఁ దాటంకముల్ మెదలి కదలి
అవటు తలమందు వేణితోఁగవలు గూడ
కలకల వెలుంగునీమోమె కాంతునంబ ! 14

కుంద కుట్మలరుచి విల్చికొన్నయట్టి
స్నిగ్ధ దంతావళిచ్ఛవి చెదరి పర్వ
స్మేరణాధరమ్ము శ్రాసించిమించు
చారు వీణాధరా ! నమస్కారమమ్మ. 15

యౌవనంపులావణ్యదుగ్ధార్ణవంబు
సుముఖ పూర్ణచంద్రోదయస్ఫూర్తిఁబొంగ
కంబుబిబ్బోకభృత్కంధరంబు దాన
లభ్యమయ్యెనీకంచుఁ దలంతు నేను 16

ఫాల లావణ్యముప్పొంగి జాలువారి
స్వేదబిందూత్కరమిషమ్ముచేతజారి
అంబ ! నీనాసికామౌక్తికంబు తీరు
పొందెననుచు భావింతునేపూవుబోడి 17

తల్లి ! కచ్ఛపిన్నీవు గాంధారగాన
మాలపింపగమృగపక్షి జాలమెల్ల
జనకులయ్యు సప్తస్వర జాలమునకు
వినుచునుండునుప్ర్తాసికలను వహించి 18

సర్వ తీర్థ మంత్రాత్మికా ! శరణు శరణు
సర్వతంత్రయంత్రాత్మికా ! జయము జయము
సర్వశక్తి పీఠాత్మికా! సర్వవర్ణ !
నాద యోగ విద్యాత్మికా ! నతులు జనని ! 19

మాత! రవిశశి దీప్తి మన్మండముల
కుండలములుగా దాల్చి మక్కువలు తొనకు
నమృతహసితాల భక్త పాపౌఘములను
కడిగివేసెడి మాతంగ కన్య వీవు. 20

శేఖరీభూతశీతాంశు రేఖ లెల్ల
స్నిగ్ధ నీలాలక శ్రేణిఁ జిందులాడ
అతను లీలా ధనుస్సులై యందగించు
భ్రూలతాసుమచయమె నీ పూర్ణసదృష్టు 21

కాయకల్ప తరూద్భవ కమ్రదీర్ఘ
శాఖలే నీ కరమ్ములు శ్యామలాంబ !
లలిత హస్తాంతముల యంగుళములులలిత !
చివురు జొంపములట్లు రాజిల్లుఁగాదె 22

పంచ వర్ణ ముఖంబులఁ బంచరసము
లొలుక, పంచ విధాల చూపులఁ బ్రపంచ
పాంచ భౌతిక జీవి జీవాతువగుదు
కృత్తివాసప్రియా! నమస్కృతులు జనని! 23

పంచ పంచాయుధములఁ బ్రపంచశాంతి
చెఱుచు పాపాత్ములనుఁ బ్రభవించువీవు
అటులెపావనభక్తులనాదరించి
పరమ కృప చూపునట్టిశాంకరిని నీవు 24

పాద పద్మాంగులీనఖప్రభలయందు
ప్రతిఫలించు దేవంగనా భవ్య కచము
లపుడెయర్చించు దూర్వాంకురాలిగాఁగ
అనిశముందోఁపజేయు లోకైకజనని ! 25

గాధలను బల్కు మువ్వన్నెగళముతోడ
ఆకుపచ్చ నిపక్షద్వయమ్ముతోడ
తుండకాంతి కిం శుకములద్రోసివేయు
రా చిలుకతోడ క్రీడించు రాణివీవు ! 26

నీదు సర్వాంగములయందు నిలిచికొలిచి
పూర్ణనవరత్న భూషలు భూష్యభావ
మందెఁ గాని, నీ కవిభూషణాదులగునె?
లోక భూషణవీవు లోకైకజనని ! 27

శివుని బూజింప నీవుఁ బూజింపబడుదు
నిన్ను నర్చింప శివుడునుమన్ననగను
ఆతడాడిన బాడ నీ వటులొనర్తు
నిజమ అర్ధాంగి వగుటది నీకె చెల్లు 28

ధ్యాన ముద్రా విలీనుఁ డైజ్ఞానియవఁ డు
శాంతకుంభాకృతిగనుసుశ్యామలగను
చంద్రచూడాన్వితగ శివశక్తిఁ గాగ
తలుచునోనిన్ను ధన్యాతిధన్యుఁ డతడె. 29

చంద్రికాశీతలా ! చకచ్చకితకుండ
లా ! ఝుళంఝులన్నూపురా! రణితరశన !
ధగ ధగద్ధగితాంగి! మేధాస్వరూపి
ణి; జగన్మాత ! నన్ను మన్నింప రావె? 30

కనక సూత్రమె మాయ, బొంగరములాత్రి
మూర్తులను, చుట్టి త్రిప్పెడుమోహనముగ
వారి చేఁజిక్కి మాయా ప్రబద్ధులమగు
మేమెటు భ్రమింపకుందుమే మీన నేత్ర ? 31

కింశుకాభ తను ద్యుతికిన్ దగంగ
దలితకౌసుంభరాగ వస్త్రము ధరించి
కనకకోటీర పుష్యరాగ ప్రభా వి
భాసితాననవైతి సౌభాగ్య జనని ! 32

మత్తమాతంగ గమన ! ఉన్మత్త చిత్త
కోకిలాలాప ! హాలాదిఘూర్ణితాక్షి !
మాన్య మాతంగ తనయ ! దుర్మత్త చిత్త
దుష్టసంహారిణీ ! నమస్తుభ్యమంబ ! 33

శత సహస్ర సూర్య ప్రకాశమునవెలుఁగు
నీ తనుద్యుతిముందు వన్నెలు తొలంగి
రత్నభూషలు దివ్యవజ్రముల రుచులు
మిణుకుమిణ్కుదివ్వెలరీతి మెదలు జనని ! 34

అమ్మ ! ఈరేడు జగముల నద్భుతముగ
ఎత్త నంగాయలాడంగనీవెతగుదు
అల త్రిమూర్తుల సూర్య చంద్రులను బట్టి
అబ్బురంపుఁజెండ్లాట నీ వాడఁగలవు 35

జనని! నీ శాంత తీక్ష్ణ వీక్షణ శతాంశ
కలన వెలిగెడి సూర్యచంద్రులు నభమున,
నీ ప్రవాలాభనఖర కాంతిని సహస్ర
భాగ భాక్కులై రిక్కలు పరిఢవిల్లు 36

పద్మకర ! పద్మ మాలిని ! పద్మ నేత్ర !
పద్మ దేహాభ ! పద్మ సంపన్న వదన !
పద్మ పదపద్మ ! పద్మినీసద్మ ! నతులు
పద్మినీ నాకుఁద్వత్పద భక్తి నిమ్ము 37

పద్మ మాలాధరా ! పద్మ భవ్య గంధి !
పద్మనాభ ప్రియా ! ప్రియపద్మ ! నతులు
పద్మ ! పద్మార్చనాతుష్టభావ ! నతులు
పద్మకేసర వర్ణినీ! వందనములు. 38

వదన విధు సుధ పొంగులు వారి జనని !
నీదు సీమంత సరణిని నిర్గమించి
మించి సర్వాంగముల వ్యాపించు కతన
నీకుగల్గె సుధా మాలినీ సమాఖ్య. 39

అంబ ! నీదునాజ్ఞా చక్ర మందు వెలుఁగు
కమ్రకాశ్మీర తిలక చక్రమె సమస్త
దుష్ట భంజన మొనరింపదో? మఱేల
నాయుధాంతరములు దాల్చు నవసరమ్ము ? 40

ఓసి! బాలార్క కోటి మహోజ్వలాంగి,
నిన్ను గన్నెత్తిచూడవేనికిఁదరంబు?
కనుకనే దురారాధ్య ! దుర్గా ! యటంచు
నిన్నుపాసించుచుంద్రు సందియము లేదు. 41

అగ్ని ముఖముగ, శిరము బ్రహ్మగను, శౌరి
హృదయముగ, శిఖ రుద్రుడు, త్రిపదఁగాగ
పృధివియోనిగ, షట్కుక్షివిగను, పంచ
ముఖిగ శ్రుతి నిన్నుఁదెల్పెనంభోజ నేత్రి ! 42

అంబ ! "నిన్ను 'ఓజోసిసహోసి ప్రబల
మసిచ, భ్రాజోసి, దేవధామాసి, విశ్వ
మసిచ, విశ్వాయురనుచు, సర్వాయు" రనుచు
శ్రుతి వచించెనయ్యది యుపశ్రుతియె మాకు. 43

సంపదలు, విద్య, అభయ మోక్షములు గోరి
వేఱువేఱు గ నిన్ను భావింతు మేము
నీవు వివిధ రూపముల మన్నించి మమ్ము
వాంఛితార్థమ్ము లిడుదువే వామనయన ! 44

లసదుదారవీక్షాపరిభ్రామ్యమాణ
సకల బ్రహ్మాండమండలా ! చారు చర్య !
ఓ చలత్కుండలా! నమదుత్తమాంగ
సేవ్యదాఖండలా ! చిదచిత్స్వరూప ! 45

పుట్టుకలు చావులాయుఃప్రమోషములును
వార్ధకములును రుగ్మతలు మాపాలఁబెట్టి
తప్పుకొంటివి వానికి ధర్మమమ్మ?
తల్లి బిడ్డలకిడు సంపదలివటమ్మ ! 46

జనని ! నీ పూజకిడు పుష్పచయము, పత్రి
పువ్వునవ్వులతోఁబొలుపొందినటులు
అన్య సుమములు కొమ్మలనంటివాఁడి
దుఃఖ పడి రాలు చున్నట్లు దోచునాకు. 47

కలతలంబడి స్వాంత నిశ్చలతలేక
లేవ డబ్బెత్తు సత్తువ లేక నీ స
పర్యలొకపూటమానుచోఁబాపనిచయ
మశుచి మము దిగఁద్రొక్కినట్లానునమ్మ ! 48

పుట్టు చందు పుట్టుకలేని పొలతివయ్యు
అరులవధియింతువు నిరీహురాలవయ్యు
మెలఁకువవహింతు నిద్రలో మునిగియున్న
పరుల వాంఛలఁదీర్తు నిర్వాంఛవైన. 49

నీ కవాప్తానవాప్తముల్ లేకయున్న
నీదు జన్మ కర్మంబులు నిజమెఱుంగ
లోకములనుద్ధరించుట కే కదమ్మ
ఎంత నిస్వార్థ వే జననీ! నమోస్తు 50

గాత నీ కెప్డు ముఖ్య సంత్రాతగాన
నిన్ను గాయత్రి గాఁగ ధ్యానింతుమంబ !
సవితలో నీవు నిత్యవాసమ్ముఁగొనుట
వేదమాతృక ! నీవు సావిత్రి వైతి. 51

వేదవేదాంగశాస్త్రాదివిద్యలెల్ల
త్వత్స్వ రూపమౌటను సరస్వతివి నీవు
లీనవై త్రిసంధ్యల సంచరించుకతన
నిన్ను సంధ్యా మయిగను ధ్యానింతుమంబ. 52

హరి విరించి శక్తులుగ నీ వమరుకతన
వైష్ణవిగ బ్రాహ్మి గాగ భావనల నిలుతు
నిత్యసంశుద్ధవై నీవు నెగడుకతన
నిమృజియంచు నర్ఘ్య ము లిచ్చి నినుభజింత్రు. 53

మొనసిముమ్మాఱు నీ మంత్రమును బఠించి
అర్ఘ్య మిడినంతనద్ది వజ్రాయుధమయి
బాలభాను బాధించు క్రవ్యాదగణముఁ
దివిచి నెట్టును చీకటి దిబ్బలకును. 54

క్రోధ మాత్సర్యలోభ దుర్గుణ గణంబు
అశుభమతి తొలగించు నంబా, భవత్ప్ర
కీర్తనమటంచుస్మృతిపల్కుఁ గేవలమది
అర్థవాదగా నాయెడ నయ్యెనమ్మ ! 55

ప్రాణులందు నిచ్ఛాక్రియాజ్ఞానశక్తు
లోలి లక్ష్మీ సరస్వతీ కాళికలుగ
రూపు కల్పించి కొల్తుమో లోల నయన !
నీవు మాలోని దానవే కావె జనని? 56

నీవు పలుతావులందున్న దైవములకు
ధర్మపత్నివై నామ బేధములతోడ
అర్చలందుచుఁదనిసి భక్తా వనమ్ము
చేయు చున్నావు చిత్రవిచిత్రలీల. 57

సారమతి పరివ్రాజక చక్రవర్తి
శంకరుడు శక్తివాద భంజనమొనర్ప
తొలగిఁతాతనినుండినీ, వులికియతడు
లలిత! నినుగొల్చె సౌందర్యలహరి కృతిని. 58

అక్షరము బ్రహ్మ సమ్మితమ్మైననీదు
భవ్య మంత్రము సకలపాపక్షయమ్ము
అగ్ని దేవతాకము, పరమాత్మ రూప,
మిడును సాయుజ్యమని శ్రుతి నుడివె జనని ! 59

అబ్ధిజగను మాతంగిగ హైమవతిగ
దాక్షిగా నిన్ను కృతులు సంస్తముసేయు
దక్షయజ్ఞాన నీ దేహ దాహమగుట
నీకు నాద్యంత హీనత నెగడునెటులొ? 60

ధర్మము సముద్ధరింప నెదన్దలచుట
ధర "అజాయమానాబహుధావిజాయ
సే "యనెడి శ్రుతి నీదు విచిత్ర చరిత
లకు సమన్వయ రీతియా లలిత ! చెపుమ? 61

దేవి ! లోకకంటకుల మర్దించి నీవు
మోక్షమిడుచుంటి విది వైరమునకు గుఱియె
వైరములు మరణాంతముల్, బ్రదుకనిచ్చి
తిప్పలిడవలెఁ జంపిసాధింతు వేమి? 62

సకల రక్షోఘ్న మంత్రముల్, సకలదేవ
తా ప్రసాదనమనువు, లుద్భట దురంత
రోగ శమన తంత్రములు నీలోనివగుట
సకల మంత్ర తంత్రాత్మగా సాగెదీవు 63

వెల్లువను గొట్టుకొని పోవు పుల్లరీతి
జనన మరణ ప్రవాహ సంసరణ మందు
బుట్ట మున్కలనుంటఁజేపట్టునొసగి
ననుసముద్ధరించుటది యేనాటికమ్మ? 64

తన్వి ! నీవారశూకవత్తన్వివగుచు
సిగను బరామాత్మఁజెరివివాసించి, యణువు
భాతి, పీతవర్ణముగ, జీవాళిలోనఁ
జొచ్చి మాకందకుండుట చోద్యమమ్మ 65

మతి భవత్పదములయందు, మాట నుతుల,
కనులు నీరూపునందు, నీ కథల శ్రుతులు
ధ్యానమున బుద్ధి, కర మర్చనాదియందు
నిలువ నా కన్యమేల కావలెను జనని ? 66

సారమే లేని, త్వత్పద దూరమైన
తుచ్ఛ సంసారమందుఁ జేదోడు లేని
యంధుడను, నన్ను మించిదీనాతి దీనుఁ
డెవడురక్షింప నీకు శాంభవి వచించు. 67

కొండలు సరస్సులారామకుంజములను
అరయలేను నీ పూజాసుమాళికొఱకు
భక్తి హృత్పద్మమిడెద నీ పాదమందు
నన్ను నీవానిగాఁ జేసికొన్నఁజాలు 68

మంత్రహీన క్రియాహీన తంత్రహీన
భక్తి హీనము నా సమభ్యర్చ జనని !
సంభవద్వస్తు చయముచే జరుపు కొనఁగ
నైతి, నీకిది పరిపూర్ణ మౌనుగాత. 69

అంబ! నీకు సమస్త దేవాది దేవ
పత్ను లెల్లదాసీలు, నీ భవ్య మంద
పావన కటాక్ష సంలబ్ధ వైభవు లట
అల్ల బ్రహ్మేంద్రగంగా ధరాదులెల్ల. 70

మంగళములకుఁ గూడ సన్మంగళమిడు
సర్వ మంగళ వీవు నీసాటిగలరె?
ఈవుసర్వార్థసాధకి, వీవె సకల
లోక దీపాంకురమవు విలోల నేత్ర ! 71

కడపఁగలమునూఱేండ్లునిన్గాంచుచుండి
బ్రతుకఁగలమునూఱేండ్లు త్వత్పదము పట్టి
త్వన్నుతులొనర్చుచు శతమ్ముబ్రతుకఁగలము
శతము మోదింతుమమ్మ తత్సవిధఁజేరి. 72

ఆదిశక్తి "ధియోనఃప్రచోద యా" త్త
టంచు శ్రుతి పల్కు, నిది సత్యమైనయెడల
ధర్మముగ సత్యముగఁబరార్థమ్ముఁగాగ
ధీ ప్రచోదన మాకు సంధింపుమమ్మ. 73

మేఘ సవిధ విద్యుల్లేఖ మెలఁగు నటులు
ధగధగద్దీప్తి వెలిగెడి తల్లివీవు.
ఉష్ణ రశ్మి చంద్రాగ్నులందున్న భవ్య
దివ్య తేజస్సమృద్ధి నీదే గదమ్మ. 74

విగ్రహారాధన మ్మ వివేకమనుచు
పద పునశ్చరణమ్ము నిష్ఫల మటంచు
కర్మఠులకల్పనల్ సర్వ కర్మములని
అందురమ్మ తత్ప్రేరణమద్భుతమ్ము. 75

త్వన్నయన రక్త కాంతులుద్ధత సురారి
గర్వచర్వణదావాగ్ని కణములగును
శ్రీపదార్చిత రత్న మంజీర రవము
లరులగుండెలలోన ముద్గరములమ్మ. 76

నీదునిశ్శ్వాసములు దుష్ట నికర ఫణుల
రొప్పి పిప్పినిజేయు గా రుత్మతములు
నీ నఖర దీప్తి పుంజముల్నిర్నిరోధ
రిపువిఖండన నిశిత శిలీముఖములు. 77

ఆరులపైనగ్గి కురియించు నట్టికనులె
తతదయావృష్టి కురియు భక్త తతి పైన
పగర చీల్చి చెండాడు నీ భద్ర కరము
లభయహస్తములౌభక్తులందు జనని! 78

త్వన్ముఖాక్షిపాదకర పద్మముల కడల
కలయఁదిరుగును నా మనఃకపి సతమ్ము
నలిపివేయక దళభంజనము సలుపక
కాచుకొనుమమ్మ ఓ సామగానలోల 79

జగతి యను బొమ్మరిల్లు చక్కగ ఘటించి
మమ్ము తాటాకు బొమ్మల మాడ్కి నిలిపి
పూలతేనెలుకజ్జాయములను గూర్చి
ఈవుఖేలింతు బొమ్మ పెండ్లిడ్లయాట 80

మూగవానిని వాచాలుఁగాగఁజేయు
పంగుపున్దాటగాఁజేయుఁబర్వతమును
అంధునిన్ లోకవీక్షా సమగ్రుఁజేయు
నీదుసత్కృపా వీక్షణ నిరతి జనని ! 81

వాణిగా హరిప్రియ గా భవానిగాఁగ
ఏయమదలంత్రుశాకంభరీయటంచు
సృష్టిసుస్థితిలయంబులంజేయునెవతె
అట్టిత్రిభువనగురుపత్ని కంజలింతు. 82

సిరులొసంగునింద్రియతృప్తిచేయు నిఖిల
పాపములడంచు సామ్రాజ్య పదమొసంగు
త్వత్పదార్పిత నతితతుల్ తల్లి ! గౌరి
ఈయకించను దీను మన్నింపలేవె? 83

త్రికరణ విశుద్ధి నీసేవఁ దీర్చుకొనుచు
చిరము నీ కటాక్షము నుపాసింతుమేని
సేవకుని కఖిలార్థ సంసిద్ధిగ లుగు
జనని! శాంకరీ! నా నమస్కారమంబ! 84

అంబ! పద్మాలయా! పద్మ హస్త స్వచ్ఛ
వస్త్రమాల్యానులేపనా! భగవతీ! స
మస్త లోక సంపత్కరీ! హర వధూటి
నతులు నుతులు శాంభవి ! త్రిసంధ్యమ్ము నీకు 85

దిక్కరుల్ స్వర్ణ కలశలఁదెచ్చిపోయు
నమల గంగచే జలకము లార్చినట్టి
లోకమాతకు సర్వలోకైక విభుని
కాంతకగుఁగాత నా నమస్కార శతము 86

శాంతిమతి ! కమలాక్షి ! జగజ్జనని ! వి
భూతి రూపిణి ! అమర సంపూజితాంఘ్రి !
అతులపూర్ణ దయామయి! నతులు నీకు
సర్వమంగళ దేవతా! జయము జయము 87

కర దశకమును ముఖ పంచకమ్ము నీవు
తాల్చుటదియు లోకావనార్థమ్ము కొఱకె
ఇన్ని విధముల వీక్షించు చున్ననేని
జనత పాపాచరణవృత్తి సమయదంబ 88

కర్మమని పాపమని వ్యర్థ కథల నడ్డు
వెట్టిఁదాఁటించుకొంట నిర్వీర్యఫణితి
భీరువులొనర్చు పనిగ భావింతు నేను
ఉప్పునిన నీవు నారెండునుడిగిపోవె? 89

చంద్ర ! చంద్ర సహోదరీ ! చారు రూప !
చంద్ర శీతల, పూర్ణిమా చంద్ర వదన !
చారు చంద్ర కలాధరా! సారహృదయ !
పూర్ణ శతకోటిచంద్రాభ ! మ్రొక్కులివియె. 90

అంబ! నే నపరాధసహస్రములను
ఆచరించుచునుందునహర్ని శంబు
అట్టి దుష్కార్యచింతలోఁ బుట్టువెంట
నెదుటికి వచ్చి నన్ను దండింపవమ్మ 91

జనని ! “ధర్మేణపాపమపనుదతి” అని
శ్రుతి వచించినదజ్ఞాన కృతము నకట;
ఈవుసర్వ పాపముల హరించుచుండ
ధర్మబంధంబదేల? త్వద్దయయె చాలు 92

దుర్లభము నరజన్మ మందునను విప్ర
కులము పురుషత దుర్లభంబులు గదమ్మ
వాని నొసగితి నిను మరువంగనగునె?
తారకానన ! కుందావదాతరదన ! 93

ఉష్ణనినాఖుదిప్వెగా నున్న నన్ను
ఎగసనంద్రోసివెలిగింతు వేల జనని?
గుప్పెడుతమంబునేనిపోఁ గొట్టుకొనని
యీ కునుకుదీపమెందులకే మదంబ? 94

మనసు చంచలమాపైని మాట దురుసు
క్రోధమధికము దుందుడుకుందనమ్మ
హెచ్చు, సంఘము లోన నేనెట్లుబ్రదుక
నేర్తు నీదయ లేకున్న నిగమ వేద్య? 95

క్షుద్ర ఫలదలు భువిని లక్షోపలక్ష
లైనశక్తిమూర్తులుకల, వైన నాకు
వానితోబని లేదు మద్వాంఛితమ్ము
త్వత్కటాక్షమ్ము, తారకేశ్వరి ! యదిమ్ము 96

పుత్రకుడుఁ పున్నామ నరకమ్మును తొలఁచడు
భార్య సంసృతిభరముఁబాపంగలేదు
"ఆత్మనాత్మా నముద్ధరే" త్తనెడి మాట
సత్య, మాశక్తి నాకు నొసంగు జనని! 97

జనన మరణ తరంగ సంసార జలధి
కాళి ! త్వద్భక్తతతికి మోకాలిబంటి
"వస్తుసర్వంభయాన్వితం భవతి" యనగ
విందు మభయప్రదాత్రి వీవే గదమ్మ 98

అడుగడుగు గండ మగుచుఁ దానంధకార
బంధుర దురంతకూపమీభవము తల్లి !
ఇందు దిగఁబడకున్న వాఁడెవడు లేడు
ఉద్ధరింపగ నీబోటి యువతి లేదు 99

పరమ యోగిగా త్యాగి బాబాలుగాఁగ
జటి పరివ్రాజకునిగ నే సాగలేను
అంబ ! అన్నగత ప్రాణి, ననవరతము
నీకు దాసానుదాసుఁడై నెగడువాడ 100

ఎద దలంచితినొండు, కావించితొండు
వాంఛితంబొకడైన తీర్పంగ లేదు
విష మమృతమగు నమృతము విషమెయగును
నీ తలంపుచే, దెలియగ నేర్చు నెవడు? 101

అంబ ! సావిత్రి ! నీవు దయామృతమును
కురియుచున్నావు సర్వత్ర కుతలమందు
కాని నే నభాగ్యచ్ఛత్ర మూనినాడ
పడదయొక బిందువైన నా పయి నిజమ్ము 102

అస్తగిరిదేవళంబునందధివసించు
రాజరాజేశ్వరియె రవి రక్తబింబ
మర్చచేసిన కుంకుమంబాయుషస్సు
తారకలు మంత్ర పుష్పాల తీరు నందె 103

ఈజగన్నాటకమున గుర్తించి నీవు
నాకిడిన పాత్ర నటియించినాడ ససిగ
మంచిని గ్రహించి దొసగు మన్నించి నీదు
సన్నిధింజేర్చవే జగజ్జనని చాలు. 104

భవ్య మాతంగకన్యకాభరణముగను
అమరిచితి దివ్యరత్న మాల్యమును, దీని
భక్తి నెవ్వడుపఠియింప వ్రాయ వినిన
పూజ్య వాగీశ్వరత్వము పొందు నిజము 105



# మున్నుడి

పుణ్యగోదావరి మూడుపాయలు ఆత్రేయ, భరద్వాజ గౌతమిల సంగమస్థానమే (మస్కరపల్లి) మసకపల్లి. ఇది నా జన్మస్థలము. ఇది ద్రాక్షారామానికి సుమారు 7 మైళ్ళ దూరములో ఉన్నది.

ఈ పవిత్ర ప్రదేశములో భ్రమరాంబ సమేత మల్లేశ్వర స్వామి దేవాలయం వెలసినది. ఆయన మా గ్రామానికి ఆరాధ్య దైవము.

ఇక్కడి శివలింగం సుమారు ఎనిమిది అంగుళములు ఎత్తు, గౌరవర్ణము కలిగి ఉంటుంది. ఈ శివలింగమునకు కుడివైపున రక్తవర్ణములో మచ్చ కలిగి ఉంటుంది. "కిరాతార్జునీయ" గ్రంథములో దీని వివరణను మనము గమనించగలము.

పరమేశ్వరుడు నా ఆరాధ్యదైవము. అందువలననే ఈ "మల్లేశ్వర శతకమును"ఆయన కృపాకటాక్షము వలన వ్రాయగలిగితిని. బుధజనులు చదివి ఆనందించవలసినదిగా నా మనవి.

**దువ్వూరి సూర్యనారాయణ మూర్తి**

# భూమికా

నమస్తే యోగి హృద్గమ్య! నమస్తే పాప నాశన!
నమస్తే సర్వభూతేశ! శ్రీ మల్లేశ! నమోనమః

అజ్ఞాన తిమిరాకీర్ణ విమూఢ జ్ఞాన చక్షుషాం
కథం నిష్కామతా స్మాక మాశాపూరిత చేతసామ్

నిష్కామ కర్మ కరణా న్మోక్షోస్తీతి విద న్నపి
న మయా క్రియతే తద్వ త్పూర్వసంచిత కర్మణా

నమన్ ధ్యాయన్నర్చయన్చ సర్వదా సంస్మర న్నపి
త్వత్తో రక్షాం యాచమానో మోహేమగ్నో భవామ్యహమ్

తత్స్వరూపం వినిశ్చేతుం జ్ఞానిన స్తత్వవేదినః
అనేక వక్రమార్గేషు యాతాయాతం ప్రచక్రిరే.

ఆదిశక్తే స్సముత్పన్నాః త్రిమూర్తయ ఇతీ రితాః
తస్మా దేవైక మేవా ద్వితీయం బ్రహ్మేతి కధ్యతే.

నా యం పంథా రోచతే మే మహేశ!
నే యం దృష్టి స్తుష్టి మాయాతి మహ్యాం
నే యం సూక్తి ర్భక్తిమార్గం దదాతి
నేదం జ్ఞానం ముక్తిమార్గానుగుణ్యమ్.

కేచి "ద్బ్రహ్మానంద" మేవేతి ప్రోచుః
కేచి "ద్బ్రహ్మోంకార" రూపం ప్రచక్రుః
కేచి"త్సోహం బ్రహ్మ" ఇ త్యావదంతి
కేచి త్ప్రాజ్ఞాః"తత్వమసీ"తి ప్రోచుః

కేచి "దాత్మా బ్రహ్మ"ఇ త్యుచ్చరంతి
కేచిత్ "జ్ఞానం బ్రహ్మ" ఇ త్యాచరంతి
కేచి ద్బ్రహ్మ నాస్తి నాస్తీతి మిధ్యా
వాదం వదంతి పరిత స్సంవిశానాః

యే యం బ్రహ్మణ మభిసంవిశాన
శ్చరంతి మార్గేష్వతి గుంఫితేషు
తేషాం ముక్తిర్వర్తతేవా నవేతి
సందేహో మాం బాధతే దేవదేవ!

నానారూపా ణ్యాశ్రితస్సన్ జనానాం
సౌఖ్యం దుఃఖం కల్పయ న్మాయయా చ
యో మాం ధ్యాయే త్స విముక్త స్సుఖీతి
చాన్యోదుఃఖీ తి(బ్రువ న్వర్తసే త్వమ్

మాయావృతో జడధీ స్సక్తచిత్త
స్తత్వం సత్యం నైవ జానే హ మీశ!
సర్వాత్మనా వర్తమాన స్త్వ మేవ
నా న్యో స్తీతి ధ్యాతు ముద్యుక్త ఏవ.

జానంతు త్వాం భిన్నభిన్న స్వరూపం
జానంతు త్వాం కష్టదం దుఃఖదం చ
జానే హం త్వా మేక మేవాద్వితీయం
బ్రహ్మే త్యేవం సౌఖ్యదం సర్వ దేతి

తిష్టంతు మార్గాః శ్రుతి సమ్మతాశ్చ
తిష్ఠం త్వనేకే స్మృతి చోదితాశ్చ
పంథా మయాయంతు నివేది తోద్య
ప్రసీద మల్లేశ! జగ న్నివాస!

ఆభాస చైతన్య మివాంతరాత్మా
ఆనంద మాప్నోతి మహాంత మద్య
త్వన్నామ సంకీర్తన మేవ కర్తు
మావిష్కరోత్యుత్సవ మాదిదేవ!

నా స్తీతి వక్తుం న హిమే శక్తి రస్తి
బుద్ధి ర్నాస్తీ త్యేవ ముహ్యేత దేవ!
సంశయాత్మా నశ్యతీ త్యాది శ్రుత్యా
అస్తీతి త్వాం నిశ్చినో మ్యాదిదేవ!

హృష్యంతు వా బుద్ధిమాంద్యం విలోక్య
రుష్యంతువా లౌకికాస్త న్మమేతి
సాధ్వసాత్మా నాస్తి నాస్తీహ దేవ!
శ్రద్ధాం యాచే సేవితుం వాక్సుపుష్పైః

**– ఇతి – సుధీ విధేయ స్సూర్యనారాయణః**

# శ్రీ మల్లేశ్వర శతకము

**దువ్వూరి సూర్యనారాయణ మూర్తి**

వరములొసగితి వనుచుబిరబిర
కరములను జోడించి తంతియె
వరములీయక కొలుచునంతటి
తిరుఁడగాను శివా!

పరమకరుణా పరుడవని నిను
తరుణమున సేవించి తంతియ
యెరుగవా? మాబొల్లిప్రేమల
తెరగు మల్లేశా!

ఆపదలు పొడసూపెనని నే
కాపుదలచేయించు మంటిని
ఆపదే లేకున్న భక్తిని
జూపమల్లేశా!

కుటిలభక్తిని జూపుచున్నను
చటులమననము సేయుచున్నను
చటుకుమని దరిచేరికాచితి
వెటులొ మల్లేశా!

కాలసర్పము ఘాతకెంతయొ
బేలనైతిరుగాడుచును నీ
పాలబడి నందులకు బ్రోచితి
చాలుమల్లేశా!

ఇష్టసిద్ధిని కూర్చుటకు నీ
సృష్టిలో నీకన్న నెక్కుడు
దిష్టమేలేదదనుచు కొలిచితి
దేవ! మల్లేశా!

చేయుదువ? యీపాటి యుపకృతి
చేయవా? యనుకొంటి నాకు న
పాయ మేమియులేక కాచితి
వోయి మల్లేశా!

కలుగు కష్టములోన సుఖమను
పలుకురీతిని బొంకొనర్పక
కలకలను నవ్వించి తేడ్పును
గెలువ మల్లేశా!

బీదవాడను నీకు నభిషే
కాదు లేమియొనర్ప గలుగుదు?
నాదరము నాపైని విడువవు
గాద?మల్లేశా!

లంచముల నీదలచినాడ న
టంచు కోపమునందకుము నా
సంచితార్థము తృణమునైనను
గాంచ మల్లేశా!

కదలకను ధ్యానింతునా? నిలు
వదుకదా? యీమాయచిత్తము
బ్రదుకు రోజులలోన నేవియొ
సొదలు మల్లేశా!

నిముషమైనను నీదు మృదుపద
కమల సేవను జేయుటకు మా
కమితమగు సంసార బాధలె
యమరు మల్లేశా!

అన్నగతమగు నసువుతో తను
వెన్ని గడియలు నిలిచియుండెడి
నన్ని నాళ్ళను నీదుభజనము
సున్న మల్లేశా!

కాముబాధల కళ్ళుసాపుచు
నీమమడచి వివాహితులమై
లేమలకు జిక్కక తొలంగగ
లేము మల్లేశా!

కాంతకెప్పుడు జిక్కి సుఖముల
చింత చేయుచు పాశవము నా
వంత వీడగలేని తరినిక
చింత మల్లేశా!

దినము దినమంతయును పాశవ
ముననె గడపుచు నుండగను నీ
మనన మెవ్వరికోయి సుఖముల
గనక మల్లేశా!

తోడనే సంతతియు గలుగును
తోడనే యాశలు జపించును
తోడనే ధనకాంక్ష పెరుగును
చూడు మల్లేశా!

ఇంక కావలె నిండ్లు వాకిం
డ్లింక కావలె పాలగోవులు
ఇంక కావలె ధనము ధాన్యము
వింక మల్లేశా!

చుట్టె నాశాపాశ మురియై
చుట్టె మోహభుజంగి కాలకు
జుట్టె సుఖదుఃఖములు మమ్ముల
బట్టి మల్లేశా!

పుట్టుచును గిట్టుచును సంతతి
మట్టిపాలగుచుండ సుఖముల
పెట్టిపుట్టముగాద? బాధలు
జుట్టి మల్లేశా!

సంతతికినై వంతయా? నీ
పొంతకై పెనుచితంయా? యా
వంతబోధింపవు గదా? యీ
సంత మల్లేశా!

ఒక్కకంటను నేడ్చుచును వే
రొక్క కంటను నవ్వుచును నో
ప్రక్క నీ సంస్మరణ చేయుట
చిక్కు మల్లేశా!

చెప్పెదవు నీకేమి? నన్నే
తప్పకను ధ్యానింపుమని మా
కెప్పగిది సాగెడిని యెప్పుల
కుప్ప మల్లేశా!

తలపమస్థిరములని తనువులు
తలపమస్థిరములని ధనములు
వెలికి నసువులుపోవ నన్నియు
కలలు మల్లేశా!

తల్లియట తండ్రియట భార్యట
పిల్లలట యీమాయవరుస ల
వెల్ల చచ్చిన దానితోడనె
చెల్లు మల్లేశా!

మాయనాటకమును రచింపుచు
మాయపాత్రల సృష్టిచేసి య
మాయకునిపోలికను చూచెద
వోయి మల్లేశా!

ముక్కుమూసుక నీదుధ్యానము
చక్క చేయుదమన్న మానస
మెక్కడో యేసందు గొందునో
చిక్కు మల్లేశా!

భజన లుపవాసములు ఘన భే
షజము చూపుచు జపతపంబులు
నిజము భక్తులవలె నొనర్తురు
ప్రజలు మల్లేశా!

వ్రతములేలను తపములేలను
పతితపావన! నిన్నుకొలువగ
నతులితంబగు నాత్మపూజయె
సతము మల్లేశా!

సర్వభూతము లందునీవే
సర్వవస్తువు లందునీవే
యుర్వియంతయు నిండియుంటివి
శర్వ! మల్లేశా!

జీవమందరి కొక్కటే సం
జీవి నిత్యమటంచు తెలిసియు
జీవహింసను చేయమానదు
జీవి మల్లేశా!

జీవమే జీవులకు జీవన
మై వరలునను వాక్యపద్ధతి
జీవిమాత్రమునకు తొలంగదు
దేవ! మల్లేశా!

జీవహింసకులమని మమ్ముల
చావతిట్టెదవేలనిక మా
జీవహంతవు నీవెకావా?
దేవ మల్లేశా!

జనులొనర్చెడి పనులనెల్లను
కనుచు తప్పిది యొప్పిదందువు
కనరుపరు లెవ్వరును నీవగు
పనులు మల్లేశా!

నీదుచేతకు మాదుచేతకు
భేదమున్నది యాదిదేవా!
మాదుచేతయె కొంతసౌమ్యము
శ్రీద! మల్లేశా!

పాలపాపల ముద్దుబిడ్డల
కాలమందున్నట్టి వారల
జాలిలేకను చంపుదువు నీ
లీల మల్లేశా!

పూలపిందెల పండ్లతోడను
చాలతూగుచునున్న సంసా
రాలజూచి సహించలేవీ
వేల? మల్లేశా!

కృపణుకోటీశ్వరుని జేయుదు
వెపుడునిర్ధనుజేతు దాతను
నెపమువేతువు సజ్జనునిపై
నెపుడు మల్లేశా!

ఆయువధికము దుర్మదాంధుల
కాయువల్పము ధర్మపరులకు
ఆయువున్నను బాధలధికము
లోయి మల్లేశా!

ఒక్కపూటకె లేనివానికి
పెక్కుసంతతి గూర్తు, ధనికుదు
పెక్కుకాంతల గూడ సుతులుహు
ళక్కి మల్లేశా!

కడుపునిండగ తినిన యరుగక
పడునుబాధ యజీర్తిచే ధని
కుడు; నిరర్థుడు కడుపుమంటను
బడెడి మల్లేశా!

లెక్కపెట్టిన నీదుసృష్టిని
మిక్కుటంబులు కానిపనులీ
ఫక్కిమానగలేవు నాయము
దక్కి మల్లేశా!

కానియాంతర దృష్టిచూచిన
జ్ఞానిత్వత్కృతములని మనమున
నైననెంచడు నిందచేయడు
పూని మల్లేశా!

జగముమాయావృతము రేయిం
బగళులన కనుమూతతెరువులు
నిగళయుగమీ కర్మపాశం
బగును మల్లేశా!

చన్నుజనిలో జీవములు కను
మిన్నుగానక పాపపుణ్యము
లెన్ని చేసేతను నొనర్చెనో?
పన్ని మల్లేశా!

పుణ్యఫల మానందరూపమ
గణ్యమవ్యయ మప్రమేయ! శ
రణ్యమగు జీవికిని, పాప మ
రణ్యమగును శివా!

నిత్యధీమంతుం డకామ్యుడ
నిత్యధీమంతుండు కామ్యుడు
సత్యముగ కామ్యునకె బాధలు
నిత్య! మల్లేశా!

భవదధీనము నాదుహృదయము
భవదధీనము నాదుస్వామ్యము
భవజనిత బాధలను బాపుమ
శివుడ! మల్లేశా!

పాపచింతలుమాన్పి మాకగు
నాపదలకడ్డంబు పడు నీ
ప్రాపుకోరుచునంటి నీవే
కాపు మల్లేశా!

భూషణము లీ లేను భక్తుల
వేషములు వేయంగజాలను
భేషజములే లేవు భక్తసు
పోష మల్లేశా!

నీదుధ్యానము నీదుభజనము
నీదు సంస్తుతికన్న నాకిక
లేదు కృషి యన్యంబు శంభో!
శ్రీద! మల్లేశా!

అరమరలు లేకుండ నీ సం
స్మరణ చేయుచునుంటినని నీ
చురుకు చూపకుమయ్య మస్కర
పురము మల్లేశా!

చురుకు చూపిననిన్ను లోకులు
హరుడు ఖరుడును రాజసుడు పుర
హరుడనుచు దెప్పుదురు మస్కర
పురము మల్లేశా!

ఏమినోములు నోచుకొన్నదో?
యేమివ్రతములు చేసికొన్నదో?
యీమహాక్షేత్రమ్ము మస్కర
భూమి మల్లేశా!

మాతగౌతమితల్లి నిత్యము
శీతలోదక పాయసంబిడి
ప్రీతిపెంచెను మమ్ము సుగుణో
పేత మల్లేశా!

తల్లిగౌతమి తండ్రినీవని
యుల్లమందున నమ్మినందుకు
వల్లకాడొనరిచిరి గ్రామం
బెల్ల మల్లేశా!

ఉన్నవారలలోన పెద్దలు
పిన్నలను భయభక్తి చచ్చెను
ఉన్నమట్టుకు ముష్టిపాత్ర లి
వన్ని మల్లేశా!

మెట్టపల్లము భూములన్నియు
చుట్టికడుపున పెట్టుకొన్నది
చిట్టిమాగౌతమికి ఎంతటి
పొట్టో? మల్లేశా!

ఒకరినుడులన మా కహృద్యము
లొకరిచేతలు విషము, కప్పల
బెకబెకలు మామతము ప్రజ కో
రికలు మల్లేశా!

పొరులొక్కరితోడ నొకరును
చేరిపలుకరు చూడ“నెవరికి
వారె యమునాతీరె” యన్నటు
లైరి మల్లేశా!

సిగ్గులజ్జలు సన్నగిల్లెను
ఎగ్గులన్నియు మంటకలిసెను
బొగ్గులయ్యెను పొరుగులన్నియు
తగ్గి మల్లేశా!

గురులు గురుభార్యలును తల్లులు
పరులు స్త్రీయలటన్న వావులు
వరుసలెల్ల నశించె పాశవ
గరిమ మల్లేశా!

జారచోరులు దుండగీడులు
ఆరితేరిన తంత్రకర్తలు
క్రూర నిబిడీకృతము మాదగు
నూరు మల్లేశా!

పొందుపడునా? యనిననేనే
మందు? నీచలవే యిదంతయు
ముందుకలదు ముసుళ్ళపండుగ
పొంద మల్లేశా!

ఉంటివా మస్కరపురంబున
నుంటివా? మాపాలిదైవమ
తొంటిరూపు తొలంగెనా!ము
క్కంటి మల్లేశా!

ఉన్ననీగోలేల? చూచుచు
నున్న నీపోరేల? కాచుచు
నున్న కలహాలేల? బ్రోవగ
దన్న మల్లేశా!

సకల సౌభాగ్యములు కూర్చుచు
సకలజనులకు సౌఖ్యమిచ్చుచు
ప్రకటసౌహార్ద్రం బొసంగుమ
యికను మల్లేశా!

బ్రదుకు బ్రదుకంతయును పిడికిట
నదిమి నీమృదుపద భజనచే
యుదుము పెరచింతనలు మానుక
సదయ! మల్లేశా!

భక్తులముకామా? స్మరింపగ
శక్తియేలేదా? ముకుంద! వి
రక్తులము కామా? యిదేమి కు
యుక్తి మల్లేశా!

ఏడిపించెదవా? జనావళి
పాడియగునయ్యా? స్వజనులను
చూడరావయ్యా! మదంబిక
గూడిమల్లేశా!

పలకరించెదవా? తనూలత
పులకరించునయా, హృదబ్జము
కలతజెందునయా, స్మరించుచు
నిలువ మల్లేశా!

తినుటకేదయ్యా? రవంతయు
మనుటకేదయ్యా? పరుండిన
కునుకులేనయ్యా దయామతి
కనుము మల్లేశా!

గోచరుండవు సూక్ష్మదృష్టి క
గోచరుండవు స్థూలదృష్టికి
నీచమత్కృతి సర్వజీవుల
బ్రోచు మల్లేశా!

కాలరూపుడవై చరించుచు
లీలజనకృత పాపపుణ్యము
లాలకింతువు భక్తజనపరి
పాల మల్లేశా!

కనెడివారెవరనుచు పాపము
పనుల జేయు నమాయకవు జీ
వనుల యజ్ఞతకై హసింతువు
కనుచు మల్లేశా!

శాపదగ్ధులమైతిమా? మా
పాపమేనా? యీఅయోమయ
కూపనిత్య నివాసమేనా.
జూప మల్లేశా!

పుణ్యకార్యము లణగిపోయె న
గణ్యమయ్యెను క్రౌర్యమిక షా
డ్గుణ్యమూర్తీ! కావు దీన శ
రణ్య! మల్లేశా!

ఋణములన్నిటిలోన భక్తుల
ఋణముదీరుట కష్టమో ని
ర్గుణ! పరాత్పర! బోధకెంతటి
చణుడ? మల్లేశా!

మోక్షదాతవు భువనములు నీ
కుక్షిదాల్చిన భీకరుండవు
పక్షపాంతబేల నీవే
సాక్షి మల్లేశా!

గడచె వయసు సగంబునేటికి
పిడుగువలె నుంటిమి రవంతయు
కడగిచేసిన దెల్ల భూమికి
చెడుగె మల్లేశా!

నిత్యమును కీర్తిప్రదంబును
భృత్యసమ్మతమైన కార్యము
సత్యముగ జేయంగలేదిక
నిత్య! మల్లేశా!

బ్రతుకులన్నియు వ్యర్థములు మా
కతుకులన్ని యమంగళమ్ములు
బ్రతుక భూభరమొక్కటే యా
శ్రితుడ మల్లేశా!

నీటిబుడగల వంటితనువుల
వాటముగ ముస్తాబుచేసియు
మాటిమాటికి నెగిరిపడ నిం
కేటికోయి శివా!

రేపోనేడో చచ్చి నారక
కూపమందున కుములు తనువుల
నాపనీదును నాదుతరమా
పాపహంత శివా!

చేరిబ్రోచెదవా? యిదేకడ
సారమా? చూపైనలేదా?
కోరినినుజేరితిని దిక్కిక
లేరు మల్లేశా!

పాడుకొందును నిన్ను పరిపరి
వేడుకొందును, త్రోసిపుచ్చిన
వీడనిన్నిక మమ్ముదయతో
చూడు మల్లేశా!

భూములిమ్మని వేడలేదో
స్వామి ధనధాన్యముల కోరను
మామనంబుల నిలుము పాప వి
రామ మల్లేశా!

మాటయే మాణిక్యమా? నీ
మూటమునిగినదయ్య? కృపనీ
పాటిముద్దును దీర్చు మాకిదె
కోటి మల్లేశా!

అంబమాపాలిటికి సుఖ నికు
రుంబ జగముల కాదిశక్తియు
సంబరముతో కాచు మా భ్రమ
రాంబ మల్లేశా!

పొగడె నాలుగు వేదములు నిను
పొగడె నిగమములున్, ముఖాముఖి
పొగడనేనిదిలెక్కయా యీ
జగతి మల్లేశా!

సకల దేవేంద్రాది మస్తక
నికరమకుట విరాజిరత్న
ప్రకర భూషితపాద! జనపా
లకుడ మల్లేశా!

నిన్ను తెలిసికొనంగ పండితు
లెన్నోవిధముల తఱచి తెలియక
చిన్నబోయిరి యాదియంతము
నున్న మల్లేశా!

నీదుతత్వము నీదురూపము
నీదువాసము నీ కుయుక్తులు
నీదు చరితము నెరుగుజీవియె
లేదు మల్లేశా!

నీవెసత్యము నీవెయనృతము
నీవెసుఖదుఃఖములు రెండును
నీవె జీవిని జీవి నీవే
దేవ మల్లేశా!

కావముప్పది మూడు కోటుల
జీవరాసులకెల్ల సద్గతి
నీవగా కన్యంబుగలదా?
దేవ మల్లేశా!

తావ కేచ్ఛా మాత్రజన్యము
తావ కేచ్ఛా మాత్రనశ్యము
దేవయీజగమంత, కావగ
రావ? మల్లేశా!

కేవలుడవయి లీలగానీ
భావచిత్రపు నాట్యమంతయు
నీవె యాజ్ఞాపింప నాడును
జీవి మల్లేశా!

అందముగ నీసంస్మరణ ము
న్మందు చేతునొ? చేయజాలనొ?
వందనములివె నిర్వికల్పా
నంద మల్లేశా!

సెలవు కరుణాసాగరా! యిక
సెలవునిమ్ము త్వదీయ పద సే
వలను దీర్చితి వేడికొంటిని
సెలవు మల్లేశా!



# హనుమన్నుతి

కాంచనపర్వతోపమనికామ మహోజ్వల దివ్య విగ్రహో
దంచితుఁబారిజాత తరుహారి సుమూల నివాసు భాసురా
భ్యంచిత దీప్తనేత్రుఁబరమాద్భుత సుందరపుణ్యదర్శనున్
పంచముఖాంజనేయుని సువర్చల భర్తఁ దలంతునెమ్మదిన్.

హరిహరధాతృరూపుని ననంత మహామహిమాభిరామునిన్
పరగత సర్వదుఃఖభయభంజనదక్షు త్రిలోక రక్షకున్
పరమదయామయున్ బతితపావను శ్రీరఘురాముదూత భా
స్కరతనయానురక్తుని హసన్ముఖుఁ గొల్చెద వాయునందనున్.

అనుపమశంకరాంశుని సమస్తసురార్చిత పాదపంకజున్
గనదురు సత్ప్రతాప సపరిఖండిత కౌణపముఖ్యసింహతిన్
ప్రణత సువర్చలాంకిత శుభప్రద భవ్యతరోరుమూలునిన్
వినతసమస్త ఖేచసుబృందు నుతింతును వాయునందనున్

లంకాదాహక! నీవు నాభయములెల్లంగాల్చిపోకార్చి ని
శ్శంకన్ ధర్మమునందె నామనసు నిచ్చల్ నిల్పి దుర్భావనా
తంకంబుల్ పరిమార్చి యింద్రియతతిన్ త్రయ్యంత ధర్మాళిలో
నింకంజేయుము భక్తపాపహర సర్వేశాంశ తస్సంభవా!

మానవతానుభావ్యము లమందమహోఘము లట్టిపాపసం
తాన తిరస్కృతిందొలఁచి ధార్మిక భాస్కరతేజమిచ్చి యీ
మానవతాప్రపంచమది మాదెస మ్రొగ్గఁజేయుమయ్య పం
చానన కోటిసంగతబలా! గృహిణీకృత తత్సువర్చలా!

కోరను విత్తరాశి నిఁకఁగోర మహేంద్రపదంబునేని నే
కోరను యక్షరాట్పదవిఁగోర బుభుక్షను దేవజన్మమున్
గోరను గాని నే నొకడెకోరుదు నీదు కృపార్ద్రదృష్టి నో
శూరశిఖామణీ దయఁ ద్రిశుద్ధిగదాని ననుగ్రహింపవే!

బలితపుప్రార్భవాఘతతిఁ బాపి గ్రహార్తిని బాఱఁద్రోలియి
య్యిలజనులన్ గ్రహించు నపమృత్యుభయంబుననణంచి యాసువ
ర్చల నవయౌవనామృతముఁజాలఁగగ్రోలెడి యర్కబంధు! నా
తలఁపుననుండి యెల్లపుడు ధార్మికవృత్తి ననుగ్రహింపవే!

పీడలనీతిబాధలను పెంపఱఁజేయుచుఁ గూర్చి భద్రముల్
గాడపునెవ్వగల్ తొలఁచి కష్టములన్ దురితాళిఁదోలి నీ
నీడనుజేరియున్న ననునేర్పున మన్చు శివావతార! నీ
వాఁడ విపన్నుఁడన్ అవనభారము నీపయినుంచు భక్తుఁడన్

ఓయి కపీంద్ర! యింద్రనుత! ఓయి క్షితీంద్ర! మహాతపస్సులన్
ధ్యేయమునీపదప్రణతి, దివ్యగజేంద్ర బలాఢ్య! పెంచుమా
స్వీయుల దాసవర్యుల వివేక సమృద్ధులనిచ్చి నిత్యమున్
పాయక, ఓజపాకుసుమ భాస్వరదేహ! సమీరనందనా

ఆకసమిందు సూర్యులునునగ్నియు రిక్కలు నీరు నీవయా
నాకవిభుండు శంకరుఁడు నబ్జజు డల్ల రమేశుఁడీవయా
లోకపతుల్ దిగీశులు మరుత్తులు శైలము లీవ, నాహృదిన్
శ్రీకరమూర్తినిల్పిన పరేశుఁడ వీవ కపీశ! రక్షమాం

లోకములన్ సృజించెదవు లోకులకెల్లను బుష్టిఁగూర్తు వా
లోకులసంహరించెదవు లోకములెల్లఁద్వదీయమూర్తులే
నీకుఁబ్రభుండు లేఁడు కపినేత! ప్రభుండవు సర్వ సృష్టికిన్
భీకరపంచవక్త్ర! సురభీకృత సర్వవిదిగ్దిగంతరా!

ఆపదలన్దమస్సులకునర్కుడవీవ జనావనేచ్ఛయే
చూపఁగలాఁడ వెల్లపుడుసూ; పురుహూతుఁడు మ్రొక్కునీకు నీ
ప్రాపునుగోరుచుంద్రు మునివర్యులు కిల్బిష నిహంతవీవ నీ
చూపులనాపయింబరపు చొక్క, భజింతు సమీరనందనా!

ఘనపాపంబులొనర్చిదిక్కఱిన సంఘంబేని నీ పాదముల్
తనుకంగా నొకతూరి దానికధికోత్సాహంబుచేకూర్తువో
హనుమా! సర్వజనైక మోహన! భవిష్యద్బ్రహ్మ! దీనావనా!
నిను నాచిత్తమునందు నిత్యమును ధ్యానింతున్ సమీరాత్మజా!

బంగరు జన్నిదంబును శుభప్రదమౌంజియు చల్లడంబునున్
బింగలదృష్టియుం జెవుల నిద్దపుఁగుండలముల్ త్రిణేత్రముల్
వంగిన కుచ్చుతోఁకయును బాహుచతుష్టయముందలిర్పగా
జంగమ మేరువౌదువు నిజంబుగ పావని! లోకపావనా!

చలనములేని రక్తిని నిజంబగుభక్తిని నీపదాబ్జముల్
తలచుచు సేవలంజలుపు తత్పరభావము నాకు నిమ్మటం
చెలమిని నే దంలచునపుడిట్టె మదీయమనోవ్యథల్ రుజల్
తొలఁగినశించు నగ్నిపడు తూలముపోలికి వాయునందనా!

ఇది నా కిమ్మన, భక్తుఁడీతడఁడని యెన్నేఁగూర్చుచున్నావు బు
ద్ధ్భదమౌ నాజని ధన్యమయ్యెను స్వయంభూదేవ! పంచాననా!
సదయుండౌచు జయాశిషంబిడు ప్రభావప్రఖ్యమూర్తీ! నినున్
మదిధ్యానింతు జపింతునెప్డు, పరమాత్మా! జోత వాతాత్మజా!

హరిహరముఖ్యదేవగణ హారి కిరీట నిబద్ధ విస్ఫుర
త్స్ఫురుచిర దివ్యరత్న పరిశోభిత పాదనఖ ప్రకాశ సుం
దర భవదీయపాద పరిణద్ధ రజఃకణపూతదాస శం
కరఁ కరవాలశూల పరిఘాయుధధారి! నమోస్తు వాయుజా!

కనులను మోడ్చి బాహుపరిఘల్ పయికెత్తి, ఘటించి తాళముల్
మనమున రామనామమె సులక్ష్యముగా భజనమ్మొనర్చుచున్
కనులను బాష్పముల్ దొరగఁగా నటనమ్మొనరించు నీదు రూ
పును దిలకింపగా మదిని పుట్టదె భక్తి యదెట్టి వారికిన్?

నినుధ్యానించియజించువారలును నీనిర్ణిద్రసేవావిధుల్
మననంబుల్ మదిఁజేయువారలును, నీమాన్యస్వరూపంబు నీ
తనువుందాల్తురు, స్వామి భైరవులు కాదా సాక్షియిద్దాని, కే
మనివర్ణింతును నీమహామహిమ సర్వాత్మా! నమోవాకముల్

కండలమెండుగ్రక్కదల కర్కశకాయము పింగళాక్షులు
ద్దండతరాతిభీకరవిదారణదక్ష మహోగ్రవాలమున్
పండినరోమరాజి, నిరవద్యపరాక్రమ మాంజనేయ నీ
దండితనంబుఁజాటెడిగదయ్య మహాత్మ! ప్రభంజనాత్మజా!

ఆరనికార్యదీక్షయు ననన్యపరోపకృతి ప్రశస్తియున్
ధీరత, వాక్పటుత్వము, సుధీగణసంస్తుత కర్మనిష్ఠయున్
పేరుప్రతిష్ఠలాయువు! గపిప్రవరా నినుబోలనిచ్చి మా
భైరవమూర్తిగారికి సభాపరిపూజ్యతనిమ్ము సర్వదా!

నిండుసభన్ సుఖాసనము నీకిడకుండుట కాంచి వాలము
ద్దండతఁబెంచి దాని సముదదీంచితపీఠముగాఁగఁజుట్టి వే
దండమురీతినెక్కి తలఁదన్నుదునన్నటు వానిముందు గూ
ర్చుండి దశాస్యగర్వము నిరుక్తినణంచితి వాయునందనా!

నీకృతికిన్ బహూకృతిగ నిర్మలమౌక్తిక హారమీయఁరా
మాకృతి యొక్కమౌక్తికమునందుఁగనంబడదేయటంచు నే
కైక సుమౌక్తికమ్ముఁజిదుకంగను మోఁదితివంట లేదె నీ
కాక? జగమ్మురామమయమై కనుపట్టెనె వాయునందనా?

త్రిజగన్మాతను సీతనొక్కత్రుటిలో శ్రీరాముసాన్నిధ్యమున్
బుజమందెక్కుమ చేర్తునంటివట సంపూర్ణాకృతింజూపి భూ
మిజ నమ్మించితివంట పావని! నిజమ్మే నీ మహాభక్తి శ
క్తిజయాంకమ్ములవట్టివే, కనుక నీకే చెల్లు నట్లాడఁగన్

ఇనుని గ్రసింప వజ్రినినుచేయగ మూర్ఛిలినప్డు తండ్రి ని
న్ననువుగదాఁచి దాగినపుడా సురసంఘములా శిషమ్ములన్
దనుపుచు వేఁడ నీ జనకుఁ, దానునుదారతచూపి మన్చెగా
క నిలజ! లేనిచోఁ బ్రళయమై జగమెల్లను నాఁడె ద్రుంగదే!

అడ్డగఁదోఁకఁదీయుమనియాడినభీముని, నేనువృద్ధుఁడన్
దొడ్డబలంబు వాఁడ వటుత్రోసుకపొమ్మనఁద్రోసి ముందుకున్
బడ్డ నిజానుజున్గని సభాజన బంధుతదెల్పి తోడు పా
టెడ్డ మహానుభావుఁడ వహీన బలాఢ్యుఁడవీవ పావనీ!

రామునిలక్ష్మణున్ బుజములన్ ధరియించుచు వాయువేగివై
సామముమీఱ కీశవిభుసన్నిధి నిల్పియు, నగ్నిసాక్షిగా
నామహనీయులంగలిపి యక్కఱలెల్లను జక్కదీర్చి నీ
కోమలదూతభావమతిగుప్తముగా నెరవేర్పవే ప్రభూ!

కడలినిదాటుటా సురసగర్భమువెల్వడు టాజి మూర్ఛలో
బడిన సుమిత్రనందనుని ప్రాణము నిల్పుట లంకఁగాల్చుటల్
దుడుకని జంబుమాలినటు దుర్ధరునక్షుని నాజిగూల్చుటల్
పుడమిని నీవెనర్చిన యమోఘ మహత్కృతులో మరుత్సుతా!

అందఱమర్త్యులయ్యు, నమృతాంధసులైనను, వేల్పులెల్లరుం
జెందిరిమిత్తి,నీవొ చిరంజీవివి, పిల్చిన నోయటందు, వా
క్రందనలెల్ల విందువు, నిరాశ్రయదాసులనుద్ధరించి వా
రందరికోర్కులన్ సఫలమౌనటు చేయుము వాయునందనా!

మంగళమో మహనీయా!
మంగళమో గిళిత పూర్ణమార్తాండవిభూ
మంగళము భైరవార్చిత
మంగళమిదెగొనుము సకలమానవరక్షా!

# తుది మాట

మా తండ్రిగారు కీ॥శే॥ శ్రీ దువ్వూరి సూర్యనారాయణ శాస్త్రి గారి అముద్రిత మరియు ఆనాటి వివిధ పత్రికలలో (1930-1960) ప్రచురించబడిన కవితలు, శతకములు, సాహిత్య, వ్యాకరణ విమర్శనా వ్యాసములను సంకలన పరచి పుస్తకముల రూపములో ముద్రించాలి అని ఆయన శత జయంతి సందర్భముగా కుటుంబ సభ్యులందరు నిర్ణయించినారు.

మావద్దలేని ఆయన పుస్తకాలు, ఆయన వ్రాత ప్రతులను సేకరించి సంకలన పరచుటకు దాదాపు ఆరునెలల కాలం పట్టినది. ఈ ప్రచురణ పనిలో ప్రత్యక్ష, పరోక్ష సహకారమును అందించిన స్నేహితులకు, కుటుంబ సభ్యులకు మా ధన్యవాదములు.

నిర్దుష్టముగా డి.టి.పి. చేసి, చక్కని పుస్తకాలను ప్రచురించి ఇచ్చిన దేవి ప్రింటర్స్ సారధి శ్రీమతి చిలకలపూడి శశిరేఖ గారికి మా హృదయ పూర్వక కృతజ్ఞతలు.

పుస్తక సేకరణ, ఇంటర్నెట్‌లో అప్‌లోడ్ చేయుటకు సహకరించిన చిరంజీవి లక్ష్మీ సూర్యమనోజ్, చిరంజీవి అనంత్ మరియు చిరంజీవి లాస్యలకు ఆశీర్వచనములతో...

సంకలన కర్తలు
**దువ్వూరి సూర్యభగవానులు**
**దువ్వూరి సుబ్రహ్మణ్యం**


**అడ్రస్ :**
యం.ఐ.జి.ఎ-95
డా॥ ఎ.ఎస్. రావు నగర్,
హైదరాబాద్-500 062.
ఫోన్ : 9494839651

